శ్రీ

# ఉషానాటకము

సటిప్పణము.



మదరాసు క్రిస్టియన్ కాలేజిలో
గీర్వాణభాషాప్రధానోపాధ్యాయుఁడుగాను
ఉపభాషావిచారణాధికారిగాను ఉండిన

వేదము - వేంకటరాయశాస్త్రిచే

విరచితమై



స్వకీయ
జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలయందు
మదరాసు ముత్యాలపేట, మల్లికేశ్వరవీథి, నెం 4 లో,
ముద్రితమై
ప్రకటింపఁబడినది.

రెండవ కూర్పు.

1913 - వ సం.





దీని వెల 8 అణాలు.

# నాటకపాత్రములు.

---

## పురుషులు.

సూత్రధారుఁడు.

నలకూబరుఁడు.

బాణుఁడు.

కుంభాండుఁడు.—బాణునిమంత్రి.

ఆహ్లాదనుఁడు.—బాణపుత్త్రుఁడు.

గంభీరవేది.—ఉషకై బాణుఁ డుద్దేశించిన వరుఁడు.

ప్రతీహారి.

హాహా హూహువులు.—గంధర్వులు.

అగ్ని, ఆదిత్యుఁడు, వాయువు, చంద్రుఁడు.

అనిరుద్ధుఁడు.—కథానాయకుఁడు.

విదూషకుఁడు.

కంచుకి.

పురుషుఁడు —(కారాగృహసేవకుఁడు.)

ప్రకరీనాయకుఁడు, పతాకానాయకుఁడు.

శ్రీకృష్ణుఁడు.

శివజ్వరము, విష్ణుజ్వరము.

ఇంద్రుఁడు.

## స్త్రీలు.

నటి.

రాణి.—(బాణునిభార్య.)

ఉష.—బాణసుత, కథానాయిక.

చిత్రరేఖ.—కుంభాండసుత, ఉషాసఖి.

కరేణుక.—ఉషాధాత్రేయి.

మదనిక, కుముదిక.—ఉషచెలులు.

రంభ, ఊర్వశి, మేనక.

చంపరిక, కలవాణి.—ద్వారకలో ఉద్యానపాలికలు.

యక్షిణి.

---

శ్రీ

( )

# ఉష.

ఉ. శ్రీరమణాత్మచోరుని వశీకృతబాణసుతాభిసారునిన్
మారకుమారునిన్ బలిరమామహితాసురభూవిహారునిన్
గోరకధన్వకూటమునఁ గోపుర మొప్పఁగ నిల్చి కాచె నా
శారిక పల్కుఁగాత సరసస్వరసంపద మీకు భద్రముల్. ౧

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు.—చాలును. అతివిస్తర మేల ? ఆర్యా,

నటి.—[ప్రవేశించి] ఏమివిశేషము ఆర్యపుత్త్రా ?

సూత్ర.—ఆర్యమిశ్రులు ఉషనే కనఁగోరుచున్నారు.

నటి.—ఆహాహా ! మనకు వెండియు మంచికాలము వచ్చినది, ఆర్యపుత్త్రా ?

సూత్ర.—మఱి యీయార్యమిశ్రులకు శ్రీవేంకటరాయశాస్త్రులవారి ప్రబంధంబుపై నింతమక్కువకుం గతం బెఱుంగుదువా ?

నటి.—ఎఱుఁగ కేమి ఆర్యపుత్త్రా, వక్కాణించెద వినుము.

సీ. ఛాత్త్రసాహస్రప్రచారంబుగా నాట । కములుఁ దన్నిగమంబుఁ గఱపినారు,
సర్వజ్ఞసింగమసార్వభౌమునిగద్దె । యెక్కినదొరమది కెక్కినారు,

౧. పద్యము—శ్రీపతియగు నారాయణునికి మనోహరుఁడును, తన్ను బాణపుత్త్రి యయిన యుష కలిసి రేనక్తె ఇల్లు వదలి ఏకాంతభూములకు వచ్చునట్లుగా చేసికొని, బలిచక్రవర్తియొక్క సంపదచేత మహనీయము లయిన పాతాళప్రదేశములందు విహరించినవాఁడును, అయిన ప్రద్యుమ్నపుత్త్రుని అనిరుద్ధుని ఆపాతాళమార్గ మయిన ప్రద్యుమ్నకూట మనెడి పర్వతగుహయందు ఏశారికాదేవి గోపురము నిల్చినదియుం బోలె వెలసి యుండి ఆబాణాదులవలననుండి రక్షించినదో, ఆశారికాదేవి (గోరవంక యని శ్లేష) మధుర మయిన కంఠస్వరముతో నాట్యప్రయోగమునకు సామాజికులకును కవికిని శుభములను పలుకునుగావుత.

ఆర్యమిశ్రులు=విద్వాంసులయిన పెద్దలు.

౨ ప.—ఛాత్త్ర=శిష్య. నిగమంబున్ = ఆనాటకముల లక్షణమును. కఱపినారు=నేర్పినారు. సర్వజ్ఞసింగమనీఁడు వేంకటగిరి సంస్థానము నేలుచున్న శ్రీ శ్రీ రాజ

హూణరూపకరసం బుదరంబు నిండార । దిగఁ ద్రావి గట్టునఁ ద్రేఁచినారు,
టూటోటుఁగవులు పటాపంచ లై మాయఁ । గాంచిక వాణి కర్పించినారు,
తే. కాళిదాసుశకుంతల నేలినారు,
మించినప్రతాపకృతిని నిర్మించినారు,
తగదొకో శాస్త్రిగారిగ్రంథమును గోర
మహిత వస్తు పరాయణ మానసులకు. ౨

సూత్ర.—బళి బళి ! రసజ్ఞవుగదా. సతీ యిప్పుడీనాటకము నాడుదుము మనకుం గలుగుకీర్తిచే మనపాత్రము లెల్ల నేమగుదురో !

నటి.—పంచదారబొమ్మ లగుదురు ; కాని, చీమలు పట్టవు లే. సరియ కాని, ఇక్కాలమున కవితాకామిని పండితులకడకు వచ్చుట లేదే, ఈమనీషికడకుమాత్రము ఎట్లు వచ్చినదో !

సూత్ర.—ఎట్లు వచ్చినదో, వచియించెద వినుము.

తే. కత మరయుదేని, తదపత్యకములఁ గృతులఁ
జూచి విని మెచ్చు చతురుల సుకృత భరము ;
విధ మడుగుదేని, వలరాచవేఁడు తెగిచి
కలిమిదొరపట్టి నిదె రంభ గవసినట్లు. 3

[అని నిష్క్రమింతురు.

ప్రస్తావన సమాప్తము.

---

గోపాలకృష్ణ యాచేంద్ర మహారాజావారి పూర్వులలో మహనీయుఁడు, సర్వవిద్యావిశారదుఁడు. హూణరూపకరసంబు=షేక్స్పియరు లోనగువారి యింగ్లీషు నాటకములందలి రసము. కాంచికకు - విమర్శన గ్రంథమాలికను. మహిత...లకుకు=పూజిత మయిన యర్థమందు ఆసక్తమైన మనస్సు గలవారికి.

పంచదార—కీర్తి తెలుపుగాన దానివ్యాప్తిచేత తెల్ల నగుదు రని భావము.

మనీషి=విద్వాంసుఁడు.

3 ప.—కవితాకామిని ఈమనీషికడకు వచ్చినందులకు నీవు కారణ మడిగెదవో విధ మడిగెదవో ? కారణ మే మనఁగా,—వీరి శిశువు లయిన గ్రంథములను చూచి విని సంతోషించెడి సామాజికాదులు చేసికొన్న పుణ్యరాశియే కారణము. విధ మే దనఁగా—ఇదె ఈరంభ కుబేరపుత్త్రుని నలకూబరుని తా వలచి మన్మథోద్దీపనచే వెట్టిగొని వచ్చి కూడిన విధమే ఈయనను కవితాకామిని వచ్చి కూడినవిధము.

## శుద్ధవిష్కంభము.

స్థలకము:—అలక, చైత్రరథము.

నలకూబరుఁడు ప్రవేశించును.

నల.—[ఊర్ధ్వ మవలోకించుచు]

క. చల్లనివెలుఁ గని యీరాజా
బిల్లని డాసితిని; గందుపేరిటిపొదగే
యిల్లయి, రేలన్ మంటలు
నల్లెడుసోఁకు డిది; దీనిచదురులు దెలిసెన్. ౪

హా! రంభ లేక నలకూబరుఁడు కల్ల గదా!

రంభ.— [ప్రవేశించి] కలిమిసామిపట్టి లేక రంభమాత్రము కల్ల గాదా? అది సరిగాని, ఏవి మంటలు సల్లుచున్నవి?

నల.—ఈచంద్రకరములు, నీవు లేనితఱిని, నామీఁదికి.

రంభ.—ఇవి మహోపకారులు గదా! ఇవి గదా అమరావతినుండి నన్నిటకుం ద్రోచినవి!

నల.—మఱి యీతడ వేల గలిగినది?

రంభ.—'ఎట్లు గండము తప్పించుకొని వచ్చితివి?' అని యడుగుము.

నల.—వడివడి సూచ్యాయగా వివరింపుము.

రంభ.—నేఁడు దేవేంద్రుం డోలగంబుండెను. మే మాడుచుంటిమి. దిక్పాలు రెవ్వరును రాలేదు. ఏల యని యింద్రుఁడు కత మరయుచుండఁగా అత్యంతవికృత రూపు లిరువురు ప్రవేశించిరి. అసుర లనుకొని మహేంద్రుఁడు వజ్ర మెత్తఁగా, వారు 'నే నగ్నిని,' 'నే నాదిత్యుఁడను,' అని తెలుపుకొని శరణువేఁడిరి. ఇంద్రుఁడు వికృతికి కారణ మడుగఁగా వారు 'బాణాసురునితపోనలమునకు మాడి యిటులైతిమి,

- - - - - - - - - - - - - - - - - - - -

చల్లనివెలుఁగు గని యీ చంద్రునిఁ గూర్చి వచ్చితిని. ఇది చంద్రుఁడు గాఁడు, మ ఱేమనఁగా, మచ్చ యనెడు పొదలో నివసించి మంటలు మండెడు కొఱవిదయ్యము. ఇదె దీని టక్కు. నాకు బోధపడినది.

తపోనలమునకు=తపోగ్నికి. హరనేత్రములలో=శివునికన్నులలో (శివునికి చంద్రసూర్యాగ్నులు కన్నులు గదా.) పాకశాసనుఁడు=ఇంద్రుఁడు.

మమ్ముఁ గావవేని మే మిఁక హరనేత్రములలోఁ డాఁగి వెలువడము.' అనిరి. అంతఁ పాకశాసనుఁడు 'మీ కా శరణ మేని కలదు. ఇఁక బాణుఁడు తనవేయిచేతులతోను నావేయికన్నులనుం జెఱికవేయును, నాకు దిక్కెవ్వరు?' అని గద్దియ దుమికి తల్లడిల్లఁగా, అందఱును—

నల.—[నవ్వుచు] మీపావడలే శరణ మని నిశ్చయించిరా?

రంభ.—[నవ్వుచు] అవును, వా రట్లే నిశ్చయించిరి.

నల.—[నవ్వుచు] అగ్నియుం జొచ్చు నని మీరు భయపడితిరా?

రంభ.—[నలకూబరునికి లఘుచపేట మిచ్చుచు] మేము బాణతపోగ్నికి భయపడి మావలనఁ గా దంటిమి. వారివలన నేశాపమేని భరింతు మంటిమి.

నల.—మఱి యీగండము మీ కెట్లు తప్పినది?

రంభ.—అనుకంపమానమానసు లయిననారదమునీంద్రులవలన.

నల.—ఎట్లు?

రంభ.—ఆసమయమున వా రచ్చటికి విచ్చేసి సత్కృతులై కార్య మడిగి విని, ప్రణతల మమ్ముం గనికరించి బాణతపోవిఘ్నము మావలనం గా దని తెలిపి, నారాయణుఁడే శరణ మని యానతిచ్చిరి.

నల.—మఱి యిపు డందఱును గురుపురస్సరులై కలశాంభోనిధికిం బోయిరా?

రంభ.—వా రట్లే సమకట్టిరి గాని,—

నల.—మఱి యేమి?

రంభ.—మఱి నారదులవారు వారించి యిట్లు తెరువు చెప్పిరి.—

ఉ. ద్వారక నున్నవాఁ డిపుడు దానవకాలుఁడు వాసుదేవుఁడై ;
మారునిసౌరు మెచ్చనికుమారి యుషాఖ్య వెలుంగు దాయకున్ ;
మీరు మురారిపౌత్త్రునికి మీయరిపుత్త్రికి స్వాప్నసంగమున్
గూరుపరయ్య ; మీయెడరు గొబ్బున వేలుపులార తీఱెడున్. ౫

చపేటము=చెంపకాయ. అనుకంపమానమానసులు = కనికరించుచున్న మనస్సు కలవారు. ప్రణతలన్=నమస్కరించినవార మగు. గురుపురస్సరులై = బృహస్పతి ముందు పోవువాఁడుగాఁగలవారై. కలశాంభోనిధికిన్=పాల సముద్రమునకు.

౫ ప.—అసురసంహారుఁడయిన నారాయణమూర్తి ఇప్పుడు వసుదేవ పుత్త్రుఁడుగా జనించి శ్రీ కృష్ణరూపమున ద్వారకాపురములో నున్నాఁడు. మీవైరి యగు బాణాసురునికి మన్మథుని సౌందర్యమును సయితము మెచ్చుకోనట్టి కూఁతురు ఉష యనుకన్య కలదు.

ఇట్లు బోధించి నారదులవారు మాప్రణతులు గైకొని యంతర్ధాన మైరి.

నల.—మఱి యింద్రాదులు ?

రంభ.—ఇంద్రాదులు మదనునిం దలంచిరి. అతఁడు నొయ్యారంబులు మీఱ సపరివారుఁడై యరుదెంచెను.

నల.—అంతట ?

రంభ.—అంతట నగ్న్యాదిత్యపురుహూతు లాతనిని ట్లుగ్గడించిరి:—"ఓయి మనోభవుఁడా,

మత్త. నాదుకీలలు సున్న నీయరుణప్రవాళముముందఱన్ ;
నాదునెగ్గులు సున్న నీతరుణంపుమొల్లలముందఱన్ ;
నాదువజ్రము సున్న నీపికనాదభల్లముముందఱన్ ;
నీదుప్రాభవ మెట్టిదో నవనీతచోరుప్రియాత్మజా !" ౬.

ఇట్లు నచ్చికబుచ్చిక యిచ్చకంబుల మచ్చుఁ జల్లి కార్యముం దెలిపి, ఉషను గోడలిం జేసికొ మ్మని వేఁడిరి.

నల.—ఇఁక నీవు చెప్పనేల? ఉష తనకోడ లనఁగానే ఉప్పొంగి మాఱు వలుకక మారుఁ డంగీకరించెను.

రంభ.—అట్లే.

నల.—బాపురే ! ముందు స్వారస్య మున్నది ! అనంతరము ?

రంభ.—అట్లు బాణతపఃకాలంబున దివియందె యుండి కాయవ్యూహవిద్యాప్రభావంబున బాణగృహంబునం గొలుచు మన్న యింద్రాదులు ప్రాప్తవరుఁడై వచ్చు

మీరు కృష్ణ పౌత్త్రునికి అనిరుద్ధునికిని మీవైరికూఁతు రయిన యా యుషకును కలహో త్పాదనను ఘటియింపుఁడు; అందువలయి మీ దుఃఖము తత్క్షణమే తీఱిపోవును.—అని శ్రీకృష్ణులవారే తీర్తు రనుట.

అగ్న్యాదిత్య పురుహూతులు=సూర్యుఁడును దేవేంద్రుఁడును. ఉగ్గడించిరి=స్తుతించిరి.

౬ ప.—కీలలు=మంటలు. అరుణప్రవాళము = ఎఱ్ఱనిచిగురు. తరుణంపుమొల్లల=లేఁతమల్లెపూవుల.

వజ్రము = వజ్రాయుధము. పిక...ము = కోకిలకూఁత యనెడు బల్లెము. నవ...జా = వెన్నదొంగ యనుంగు పుత్త్రుఁడా—మన్మథుఁడా అనుట—నీవు భూలోకమందు పనిచేయవలసియున్న దని సూచించుటయు.

కాయ వ్యూహ విద్య = దేహములను అనేకములనుగా చేసికొన సాధన మయిన

బాణుని యథాపూర్వ మచ్ఛలంబునం గొలువ కాయబాహుళ్యోపసంహారపరు లై యసురలోకంబున కరిగిరి. ఉర్వశ్యాదులును హాహాహూహూవులును వారి నే యనుగమించిరి. నే నటఁ జంద్రపాదతాడిత నై యిటం బ్రాణనాయకు నోడిం బడితిని.

నల.—బళి బళి !

క. మాటలపోఁ కై న న్నపు
డంటి రొరియఁ జేసి, యిప్పు డమృతపువెల్లిం
గెంటి మనుచు నీకొంటెకుఁ
దుంటవిలుతుమామ కెరఁగుదుం భక్తిమెయిన్. ౭

రంభ.—

క. బాణునికొలువున కల గీ
ర్వాణులు నన, మనము పంచబాణుకొలువు కై
ప్రాణేశ రమ్ము పోదము ;
నాణెం బిది గాదొ యట్లు నలుఁగుటకంటెన్ ? ౮

[అని నిష్క్రమింతురు.

శుద్ధవిష్కంభము ముగిసినది.

---

యోగవిద్య. అచ్ఛలంబునన్ = కపటములేక. కాయ...లై = పెద్దదేహములను తగ్గించుకొనం గడంగినవారై. చంద్ర...నై = చంద్రకిరణములచే కొట్టఁబడినదాన నై-చంద్రుఁడు కాళ్లతో తన్నఁగా అనియు.

౭ ప.—తుంటవిలుతుమామకున్ = మన్మథుని మేనమామ యయిన యీ చంద్రునికి. ఎరఁగుదున్ = నమస్కారము చేసెదను.

# ప్రథమాంకము.

స్థలకము.—శోణపురి, బాణస్వాగతమండపము.

బాణుఁడు కుంభాండుఁడును ప్రవేశించి

యథోచిత ముపవిష్టు లగుదురు.

అగ్ని వాయ్వాదిత్యాదిపరివారము యథార్హము నిలిచి కొలుచుచుండును.

కుంభా.—అసురచక్రవర్తీ, త్రిజగతీపతీ, ఏలినవారితపఃప్రకారము విని యాశ్చర్యపడు మంటిమి. వరములు విన్న నేమగుదుమో!

బాణా.—మంత్రిసత్తమా కుంభాండా,

క. బాణుఁ డనుపే రహహా! వి
న్నాణంబుగ నాకు నిడిరి నాతలిదండ్రుల్ ;
బాణగతి ముందటికే యను
పోఁడిమి యెఱుఁగవొకో మంత్రిముఖ్యుఁడ ప్రగడా. *

ఏకీ మనవా రందఱు?

రాణి, ఆహ్లాదనుఁడు, ఉష, చిత్రరేఖ, గంభీరవేదియుఁ,
బ్రవేశింతురు.

రాణి.—ప్రాణేశ్వరులకు ప్రణామము. [అని మ్రొక్కి] ఆర్యపుత్త్రుని శుభదర్శనముచే కృతార్థురాలను.

బాణా.—రమ్ము, ప్రేయసీ, ఇటఁ గూర్చుండుము. [రాణి కూర్చుండును.

ఆహ్లా.—ఆహ్లాదనుఁడను నాయనగారిపాదములకు ప్రణమిల్లుచున్నాను.
[అని ప్రణమిల్లును.

బాణా.—రా వోయి, నాయనా, రా కూర్చుండు [ఆహ్లాదనుఁడు కూర్చుండును.

ఉష.—నాయనగారిపాదములకు ఉష ప్రణమిల్లుచున్నది. [అని యట్లుచేయును.

బాణా.—రా, అమ్మా, రా. [అని దగ్గఱ కూర్చుండఁ బెట్టుకొనును.

చిత్ర.—మామగారిపాదములకు చిత్రరేఖను మ్రొక్కుచున్నాను. [అని మ్రొక్కును.

---

* ప.—విన్నాణంబు = నేర్పు. ఇడిరి = పెట్టినారు. ప్రణమిల్లును = మ్రొక్కును.

బాణు.—కల్యాణము, కల్యాణము, కూర్చుండుము, నీచెలికడనే.

[చిత్రరేఖ ఉషకడం గూర్చుండును.

గంభీ.—మామగారిపాదములకు గంభీరవేదిని మ్రొక్కుచున్నాను.

[అని యట్లు చేయును.

బాణు.—కల్యాణము కల్యాణము, కూర్చుండుము. [గంభీరవేది కూర్చుండును.

బాణు.—మంత్రిపుంగవా, మనవా రందఱు క్షేమమా ?

కుంభా.—ఏలినవారిప్రతాపము కాచుచుండ క్షేమము గా కేమి ?

బాణు.—దేవతలు మిమ్ము చక్కఁగా కొలుచుచున్నారా ?

కుంభా.—కొలుచుచున్నారు; అనుకంపనీయులు.

బాణు.—ఊఁ. [ఆహ్లాదనుం గూర్చి] వత్సా, నీవు మాతపఃకాల మెల్ల నేమి సేయు చుంటివి ?

ఆహ్లా.—గురువర్యులను శ్రీశుక్రాచార్యులను శుశ్రూషించు చుంటిని.

కుంభా.—దానవేంద్రా,

శా. ప్రోదిన్ బాలుఁ డితండు భార్గవుని శుశ్రూషించి, వేదంబులున్
వేదాంగంబులుఁ బంచలక్షణపురావృత్తంబులున్ నేర్చి, యా
హ్లాదం బొజ్జకుఁ జేసి, సార్థకనిజాహ్లాదాఖ్యుఁ డై, 'వత్స, ప్ర [౧౦
హ్లాదానూనుఁడ వౌదు' వంచు వరముం బ్రాపించెఁ దద్వాక్కునన్.

బాణు.—వంశమునకుఁ గీర్తి దెచ్చితివి వత్సా.

ఆహ్లా.—మహానుగ్రహము, మహానుగ్రహము.

ప్రతీహారి.—[ప్రవేశించి] జయము జయము జగదీశ్వరులకు. స్వర్వేశ్యలు మేళమై నాట్యసేవార్థము వచ్చియున్నారు.

కుంభా.—దానవనాథ, మంగళార్థము వారికి సేవకు సెల వొసంగవలయును.

బాణు.—మంచిది.

[ప్రతీహారి వెలువడి రంభాదులను దోడ్కొనివచ్చి విడిచిపోవును. రంభాదులు బాణునికి మ్రొక్కి నిలుతురు.

౧౦ ప.—ప్రోదిన్=చక్కఁగా. భార్గవునిన్=శుక్రాచార్యుని. పంచలక్షణపురావృత్తంబులున్=పురాణేతిహాసములను. ఒజ్జకున్=గురువునకు. సార్థ...డై=ఆహ్లాదనుఁడనెడి తన పేరిని సార్థకము చేసి. అనూనుఁడవు=తక్కువ కానివాఁడవు.

బాణు.—ఎవ రెవరె మీరు?

రంభ.— (హంసరుతము.)

సామి, నీదాసి నేఁ, జాటుదురు రంభ యని శ్రోత్రముల నన్ను నసురేంద్రా,

ఊర్వశి.—

సామి, నీదాసి నే. స్వర్వనిత నుర్వశిని, సల్పుదును లాస్య మసురేంద్రా.

మేనక.—

సామి, నీదాసి నే, సంశ్రుతను, మేనకను, స్వాంతజుఁడు మెచ్చు నను దేవా.

హాహా హూహూ ప్రముఖులు.—

సామి, సంగీతంబులో నల్పితి మొకింతపని, సాకతము వేఁడెదము దేవా. ౧౧

బాణు.—ఆడుదురుగాని. ఓరి అగ్ని, ఈకుంభాండాదులు విన మాతపస్సును వర్ణింపుము. [నిర్వర్ణించి] ఏమిరా! నీ విట్లు బొగ్గువలె నల్లఁబడినాఁడవు?

అగ్ని.—[హుక్కా-గొట్టము నజరు చూపుచు కేలఁ బూని]

క. మహానసములోన నెపుడున్
నానిన వే నైచినాకు నాకుం గట్టెల్,
దానం గడుఁ బొగచూరుచు,
నే నల్లని బొగ్గ నైతి నిర్జరభీమా. ౧౨

బాణు.—ఏమిరా, వాయూ, నీ వేల హోమాగ్ని యూఁదకుంటివి?

[అని వాయువును కొట్ట నుంకించుచున్నాఁడు.

వాయువు.—[అమితముగా వణఁకుచు నెరులిపురివిసనకఱ్ఱ వీచుచు ఆత్మగతము] ఆహా! నేను కోరినప్రశ్నయే వచ్చినది! ధూర్త్యము చేసెదఁగాక. [ప్రకాశము] లోకనాయకా,

---

౧౧ ప.—శ్రోత్రములన్=శ్రోత్రకర్ణములయందు. స్వర్వనితన్=స్వర్గస్త్రీని. లాస్యము సల్పుదును=ఆటలో నేర్పరిని. సంశ్రుతను=ప్రఖ్యాతి గలదానను. స్వాంతజుఁడు=మన్మథుఁడు. సాకతము=అనుగ్రహము.

౧౨ ప.—మహానసము=వంటయిల్లు. నిర్జరభీమా=దేవతలకు భయంకరుఁడా. ధూర్త్యము=కపటము.

ఆ. ఊఁది యూఁది బుగ్గ లూఁపిరిబూరలై,
బుంగలై, మఱింత బూరటింపఁ
బెద్దసిద్దెలట్లు పెరిఁగి చీలినవయ్య
కుట్టుకొంటి నయ్య కొట్టకయ్య. ౧౩

బాణు.—[నిర్వర్ణించి తల యూఁచి] మంచిది; చక్కఁగా వీవుము. మఱి, వాఁ డెక్కడరా సీతలమానిసి వేగంటిపిసాసి?

వాయు.—బురుజుమీఁద కోవుర మున్నాఁడు దేవరా.

బాణు.—ఊఁ. ఓరీ, ఆదిత్యా, నీ వేలరా కట్టియ లెండింపవు?

ఆదిత్యుఁడు.—[పుండరీకము నజరు వెట్టుచు] మహాప్రభూ,

క. లేమొండమె యెవ్వేళను
గాయుచు నుండు నని సేమకట్టడయ కదా;
పాయక నే నట్లు సేయుటఁ
బాయను కట్టియల సేమ భండనభీమా. ౧౪

బాణు.—మఱి, వాఁ డెక్కడ నీసైదోడు?

ఆది.—వాఁ డెక్కడనో ఎఱుంగను, దేవా.

బాణు.—[కినుకతో] ఏమి కారణము?

ఆది.—మహాప్రభూ, మన్నింపవలయును.

ఆ. నిండు పున్నమగనె పండువెన్నెల సదా
కాయు నతని కిడినకట్టఁ బాసు;
దాన నతఁడు నేను దాయుటయే లేదు;
సపదంబు లౌన, నిక్క మిదియ. ౧౫

౧౪ ప.—లేమొండ=నీరండ. కట్టడయ=ఆజ్ఞయే. ఖండనభీమా=యుద్ధములో భయంకరుఁడా.

సైదోడు=చెలికాఁడు—చంద్రుఁ డనుట.

౧౫ ప.—దాయుటయే లేదు.—సూర్యచంద్రులు కలసిననాఁడు అమావాస్య. వారు నిండుదూరమున నున్ననాఁడు పూర్ణిమ. నిక్కము=సత్యము. జల్లిక = వీచోపును. సభాస్తారులు=సభవారు.

వాయు.—మహారాజ, నే నెఱుంగుదును. ఏలినవారికి తపస్తాపశాంతికై ఇదె యిటనె తనశీతకిరణంబుల తెల్లని చలువజల్లిం గట్టుచున్నాఁడు. [పరికించి] వాఁడె వచ్చుచున్నాఁడు.

బాణు.—[స్మితముతో] జడాత్ముఁడు, వాని కేఁగియు ముందుగాఁ గోపము.

[చంద్రుఁడు ప్రవేశించి కలువ నజ
యుంచి నమస్కరించి జల్లి వీచుచుండును.

బాణు.—[వీక్షించి] ఊఁ. ఓరీ, అగ్న్యాదిత్యులారా, మాతపస్సును చెప్పుఁడు. మీ రగగా సాక్షులరు.

ఇరువురు.—అవును మహాప్రభూ.

అగ్ని.—ఓహో సభాస్తారు లెల్లరు నాలింపుఁడు:—

శా. స్కంధగ్రంథులు వ్రస్సి వాయువులు నిర్ఘాతధ్వనిన్ మ్రోఁగఁగా,
సింధువ్రాతము క్రాఁగ నీశ్వరజటాసింధ్వంభముల్ తేర్లఁగా,
బంధం బేది సుమేరుమందరగిరిప్రాగ్భారముల్ దొర్లఁగా,
సంధాబంధురబాణదానవతపఃస్ఫారాగ్ని పర్వెన్ దివిన్. ౧౬

బాణు.—ఆహాహాహాహా !

అందఱును.—ఆహాహాహాహా !

హాహుఁడు.—ఏమియాజ్ఞ మహాప్రభూ ?

బాణు.—నిన్నెవరురా పిలిచినారు ?

కుంభా.—త్రిలోకనాయక, వీఁడు హాహాగంధర్వుఁడు, తపోవర్ణనశ్రవణపరవశుఁడై తమరు ఆహాహా యని సాధువాదము పలుకఁగా తన్నుఁ బేర్కొన్నట్లు భ్రమఁ జెందినాఁడు.

బాణు.—[బిగ్గరగా నవ్వుచు] ఓరి నిర్భాగ్యుఁడా, హూహూహూహూ!

[అని బిగ్గరగా నవ్వును.

---

౧౬ ప.—ప్రతిజ్ఞను దృఢముగా నిర్వహించువాఁడైన బాణాసురుని తపస్సుయొక్క మహాగ్ని ఆకాశమందు వ్యాపింపఁగా, ఒకదానిపై నొకటి గోడకట్టులవలె పేటియున్న గాలికట్టులు ఎడఁబాసి పిడుగుమ్రోఁతతో చీల సాగినవి, సముద్రముల సమూహము ఉడుకెక్కినది, శివుని జడలలోని యాకాశగంగయొక్క నీళ్లు తెర్లుచుండినవి, పొందుచెడి మేరుమందర పర్వతముల శిఖరములు ఊడి దొర్లపడినవి.

సాధువాదము=మెప్పుం జెప్పుట.

యలమన్ డాసగి మాహిమాద్రిజఁ, దదాయాసంబు ద్రోఁపాడ, వే
యలయుగ్రుం డటు వచ్చి కోరు వరముం జార్తిన్ ననున్ వేఁడుటల్.

ఇంకను వినుఁడు.—మాతపోగ్నినుండి.—

సీ. ఒకమిడుంగురునఁ నాజ్యోదధి కాఁగి యా । కమఠకిటుల్ కూడు గాఁగనుండ,
ఒకమిడుంగురున మేరుకుభృత్తు కరఁగి యా । నిప్పుటేట జగంబు నీల్గనుండ,
ఒకమిడుంగురున శంభుకపర్ద మెరిసి యా । కమరువాసన దెసల్ గడవనుండ,
ఒకమిడుంగురునఁ దారకకోట్లు మండి యా । కచ్చికె లిల యల్గఁ గప్పనుండ,
తే. బ్రహ్మవిష్ణ్వాదు లెల్ల నీప్రళయ మాఁపు
మనుచుఁ దనవెంట రా, సాంబుఁ డాటమున
వచ్చి, 'కోరుము కోరుము, వరము వరము,
బాణ బాణ,' యనువిభూతి పరఁగె నాకు. ౧౯

కుంభాండాదులు.—శబాస్ ! శబాస్ !

కుంభా.—ఏలినవారివరములు వినం జెవులు దురదగొనుచున్నవి.

బాణా.—మహేశ్వరుఁ డట్లు ప్రత్యక్షమై నా కిచ్చిన వరములు వినుము.

క. చండికతో వాసం బై
ఖండేందుశిఖుండు నాదుగవనుం గాచున్ ;
జెండా పసుపతి మద్భుజ
కండూతి తెముల్చు భీకరకదనం బొసఁగున్. ౨౦

అందఱును.—అహో ఈశ్వరానుగ్రహము ! అహో తపోమహిమ !

బాణా.—సరియ యేఁటోయి సూర్యాగ్నులారా ?

---

గింజుకొనఁగా కరుణ సగ మయిన శివుఁడు ఆ యాయాసమునకు నిలువలేక వేగముగా ఆతీరునసే వచ్చి నన్ను 'ఓరీ బాణా, బాణా, వర మడుగరా అడుగరా.' అని దీనముగా బతిమాలుకొనఁగా, నాకు నవ్వు వచ్చినది.

౧౯ ప.—మిడుంగురునన్ = నిప్పురవచేత. ఆజ్యోదధి = నేతిసముద్రము. కమఠకిటుల్ = ఆదికూర్మము ఆది వరాహమును. కుభృత్తు=పర్వతము. కపర్దము = జటాజూటము. ఎరిసి = కాలి. తారక = నక్షత్ర. ఇల= నేల. సాంబుఁడు=శివుఁడు.

౨౦ ప.—ఖండేందుశిఖుండు = చంద్రకలాశేఖరుఁడు - శివుఁడు. గవనున్ = పురద్వారమును. కండూతి = దురద. కదనంబు = యుద్ధమును.

సూర్యాగ్నులు.—ఔను మహాప్రభూ, మే మప్పుడు తపస్సునకు నిలువలేక హరనేత్రములందు డాఁగి చూచు చుంటిమి.

బాణు.—మహావ్వా! [రంభాదుల నుద్దేశించి] మఱి మీయాటపాటలు కానిండు.

రంభాదులు.—[ఆడుచు]

(గేయము)

నిన్నుఁ బొగడఁ దరమే!
బలిరాజసుత! నిన్నుఁ బొగడఁ దరమే!

అరహరికోపము నడఁచె నీముత్తాత,
హరిని భిక్షునిఁ జేసె నయ్య,
గిరిశుని గడపకాపరిని జేసితి వీవు,
వరము పోరడుగుకావలుఁడు మ ఱెవ్వఁడు! నిన్నుఁ॥

వేకన్ను లున్న వేవెంట బెదరవచ్చు;
వేకాళ్లు వలసకు వెరవు;
వేకేళ్లు గల్గిన వేవే ట్లొసఁగవచ్చు;
నీ కెవ్వఁ డీరేడు లోకములను నీడు! నిన్నుఁ॥

కలనఁ గాలాశ్వశృంగములు నీమీసము;
చెలులకు ముదిరధన్వలత;
వెలఁదుల కాయించువిల్లు నీమీసము;
ఇలలోన నీసాటి బలియుఁ డెం కెవ్వఁడు! నిన్నుఁ॥

అరహరి = సగముసింహము (నరసింహస్వామి)యొక్క. ముత్తాత = ప్రహ్లాదుఁడు. అయ్య = తండ్రి - బలిచక్రవర్తి, గిరిశునిన్ = శివుని. పోరు = యుద్ధమును. కావలుఁడు = బలాఢ్యుఁడు.

వేకన్నులు ఇంద్రునికిఁ గలవు. వేకాళ్లు సూర్యునికిఁ గలవు. వలసకున్ = పారిపోవుటకు. కేళ్లు = చేతులు. ఈరేడు = పదునాలుగు.

కలనన్ = యుద్ధములో. కాల..ములు = యముని గుఱ్ఱము (అగుదున్నపోతు) యొక్క కొమ్ములు. కలన...లు=ఆమీసమును చూడఁగానే శత్రువులు గుండె బ్రద్దలై చత్తురనుట. ముదిరధన్వలత = ఇంద్రధనుస్సు. చెలుల...లత—సువృష్టి సూచక మయిన యింద్ర ధనుస్సువలె సంతోషపెట్టు ననిభావము. వెలఁదులకున్= స్త్రీలకు, ఇంచువిల్లు= (మన్మథుని) చెఱకువిల్లు—మదములు గొల్పు నని భా.

బాణు.—మీకు గృహసమ్మార్జనాదిక్లేశమునకు బదులు ఇఁకమీఁద సంగీతవ్యాపారమున యుండ ననుజ్ఞ యిచ్చితిమి. చాలునా యీబహుమానము?

గంభా దులు.—[వడవడ వణంకుచు] మహాప్రసాదము.

బాణు.—[ఉషం దఱియం దివిచి, చేయి పట్టుకొని,] అమ్మా, ఎంతసుందరాంగుని సెప్పినను రూపహీనుఁ డందువు. ఇప్పటికేని తెలివి కలిగినదా? ఇఁకనైనఁ పెండ్లి చేసికొందువా అమ్మా.

[ఉష మెల్లమెల్లన తండ్రిచేయి విడిపించుకొని నిష్క్రమించును, చిత్రరేఖ ఉష ననుగమించును. గంభీరవేది ఉషను గంటికగపడునంతవఱకు వీక్షించి తర్వాత ఉస్సు రనును. ఆహ్లాదనుఁడు చిత్రరేఖ పోకం గని తల వాంచి చింతిల్లును.

బాణు.—హా! ఏమి దీనిస్వాతంత్ర్యము! ఓయి గంభీరవేదీ, చింతిల్లకు. నేను బోధించి ఉషను ఒప్పించి నీకు వివాహముచేసి మాయక్కను సంతోషపెట్టెదను లే.

గంభీ.—మామగారియనుగ్రహము.

[చిలుకలును గోయిలలును స్వాగత మంటపము చెంత మెండుగా కూయును. తుమ్మెదలు కరము ఝంకరించును. మంటపమున మలయమారుతము వీచును. పుష్పముల పరిమళము వ్యాపించును.

బాణు.—ఏమి యిది! ఋతువు వచ్చియున్నను, ఋతుధర్మము లెల్ల నిట్లిప్పుడిటు యౌగపద్యంబునం బ్రకట మగుట వింతగా నున్నది?

కుంభాండాగ్నిసూర్యాదులు.— చేతనాచేతనంబులెల్ల ఏలినవారి యభ్యుదయము నభినందించుచున్నవి.

కుంభా.—కుమార, మీనాయనగారు సంతసిల్ల నీవిద్యాప్రభావమును వసంతవర్ణనం జూపుము.

ఆహ్లా.—నాదియు నొకవిద్యయా! అయినను పెద్దలమాట నతిక్రమింపఁగాల.

---

సమ్మార్జనాది = ఊడ్చుట లోనగు.

ఋతువు = వసంతర్తువు. యౌగపద్యమునన్ = ఏకకాలమున. అభ్యుదయమును = గొప్ప మేలును.

మ. సరవిన్ వేఁడికి డస్సి, శీతలజలస్నానంబుగా, నిర్మలాం
బరపాళిం దడియార్చి, మంచుఁజెమరున్, మాఘ్యానిలం బార్పఁగా,
బురుసాపట్టుజరీబుటాపరికిణీ ముస్తీబుతో సాదరా
బురఖాతోడ జవాహరీపటలితో భూకాంత గూడెన్ మధున్. ౨౧

బాణాదులు.—బళిబళి! వహవ్వా!

ఆస్థా.—మఱియు నిపుడు,

ఉ. ఆక్షయకౌతుకంబు వొలయంగ, నశోకలతావధూటి యా
దక్షిణగంధవాహు బలితంపుఁగవుంగిటఁ గ్రుచ్చి, వేసమ
స్తక్షితిజాత సాలతలతావుల కల్గి, మరందనారి పు
ష్పాక్షులఁ జిప్పిలన్ గిసలయాధర మీయక త్రిప్పెఁ జూపవే. ౨౨

బాణాదులు.—బళిబళి! శబాస్.

బాణా.—అట్లైన నగరి కేఁగి యుద్యానంబున వసంతశోభం దిలకింతము.

[బాణరాజ్ఞీసుతకుంభాండులు నిష్క్రమింతురు.

---

౨౧ ప.—భూమి యనెడినాయిక వరుసగా వేఁడికి బడలి (గ్రీష్మధర్మము), పన్నీళ్లు స్నానమాడి (వర్షర్తుధర్మము), తెల్లనివలిపములతో తడియార్చుకొని (నిర్మలమయిన యాకాశములో జలము తగ్గిపోఁగా—శరద్ధర్మము) నునుమంచువంటి చెమటను (హేమంతధర్మము) మల్లెలమీఁది గాలి తీర్పఁగా (శిశిరర్తుధర్మము), సరిగబుటాలు గల బురుసాపట్టు పావడ ధరించి (నానావిధము లయిన పువ్వులతోడి చిగురాకు లంతటం గలిగి), సర్వము బంగారు జల్తారగు మేల్ముసుఁగు దాలిచి (బంగారువన్నెవంటి పుప్పొడి నైనైసంతటను వ్యాపించుచుండఁగా), మెండుగా నగలు (చిత్రవర్ణముల పూవులు పించెలు పక్షులును) గలిగి, వసంతుఁ డను నాయకునిం గలసెను.

౨౨ ప.—మితిలేని తమకము ఉప్పొంగఁగా, అశోకశాఖ యనెడి జవరాలు పరిమళములు వెదచల్లుచున్న యీదక్షిణపు వాయుదేవుని (చందనాది పర్చలు దాల్చి గదం బించుచు వచ్చిన దక్షిణనాయకుని) బిగువుగా ఆలింగనము చేసి, అంతట తక్కాలున ఎల్ల తావులందును సోఁచిన తీఁగల పరిమళములు ఆతనిదేహమం దున్నందున (నానా ప్రదేశములలోను సందుగొందులలోను నుండు నాయికల పరిమళములు అతని దేహమందు

[నేపథ్యమందు]

ప్రేయసీ, ఈరాత్రియే మనతనయునికి స్వప్నమున గాంధర్వవివాహమును నిర్వర్తింపుదము.

ఆది.—[జనాంతికము, అగ్న్యాదులతో] మదనభాషితమును వింటిరిగదా. మనకు మంచికాలము వచ్చుచున్నది.

[దేవతలు నిష్క్రమింతురు. గంభీరవేది మెల్లఁగా ప్రయాసతో వెడలును.

కరేణుక.—[వెనుకనుండి ప్రవేశించి గంభీరవేదిచేయి పట్టుకొని దివిచి] ఉష పోతూ వున్నప్పుడు ఎందుకు ఉస్సురన్నావు? చెప్పు.

గంభీ.—కరేణుకా, అదంతా, మామకు వెరిచినకపటం; నామాట నమ్ము. నాకు ఉషా అక్కర్లేదు, గిషా అక్కర్లేదు. నీమీద తప్ప నామనుసు ఇంకెక్కడా లేదు.

కరేణు.—అట్లైతే మరిరా యిప్పుడే పెళ్లి శోభనం అన్నీ కానీ.

గంభీ.—నీపుణ్యెం, ఇక్కడ మాట్లాడకు, నాతో అవతలికి రా చెప్తాను.

[అని నిష్క్రమింతురు.

ప్రథమాంకము ముగిసినది.

---

ఉన్నందున) ఆతనిమీఁదనే ఈసువహించి, మకరందమనెడు బాష్పములు, పువ్వులనెడి కన్నుల నుండి కాఱుచుండఁగా, అతనికి ముద్దుగొనుటకై తనచిగురాకనియెడి పెదవిని ఇయ్యక ఇటునటు త్రిప్పుకొనుచున్నది మాఁదుఁడు.—మలయమారుతము నానాజాతి పుష్పపరిమళములతో వచ్చి అశోకశాఖలో వీచి అందలి పూవులనుండి మకరందమును క్రిందికి జార్చి దాని చిగురుటాకులను ఆడించుచున్న దని భా.

# ద్వితీయాంకము.

స్థలకము:—శోణపురి, ఉషాప్రమదవనము.

ఉష, సఖీయుగళము, చిత్రలేఖయు, ప్రవేశింతురు.

[ఉష తామరసెజ్జపై మూర్ఛితయై యుండును.
సఖు లిరువురు తామరాకులతో వీచుచుందురు.

చిత్ర.—[ఉషను కేలఁ దడవి నిర్వర్ణించి, ఆత్మగతము] ఇది కామజ్వర మని నేను మొన్ననే శంకించితిని.

ఆ. లలన డీలుపడియు లావణ్యమున మించె
నలువుతెక్కుచందుకలయుఁబోలె ;
ఇట్లు జవ్వనులకు హితశత్రు వొకరాళి
మధుని వేఁడి యగునె మరుఁడు గాని. ౨౩

నేను క్షణము ఉషతో నొంటిపాటున నుండి గుట్టు తెలిసికొనియెదను. [ప్రకాశము] చెలీ మదనికా, చెలీ కుముదికా, ఈవాసంతాతపము సఖికి దుస్సహ మైనది, తామర సెజ్జలకు శమిల్లినది గాదు. అల్లయాయవ్వలిబాలచందనషండమునకుం బోయి చెలికై గందపుఁబాలు కొని రండు.

చెలులు.—నీవు వచ్చిన నంతయుం జక్కఁబడు నని మేము ముందే అనుకొంటిమి. [అని నిష్క్రమించిరి. ఉష తేరును.

చిత్ర.—ఉషా !

ఉష.—[అనాకర్ణితకముగా] నాసఖు లెక్కడ ? హా ! మూర్ఛిల్లితిఁగావలయు. ఆహా ! మూర్ఛయే యుపకారిణి యైనది. చిత్రరేఖను డేర సఖులు చనియుందురు.

---

ప్రమదవనము = ఆటతోఁట. సెజ్జ=శయ్య.

౨౩ ప.—ఈజవరాలు కృశించియు కృష్ణపక్షచంద్రరేఖవలె కాంతి హెచ్చి యున్నది. ఈవిధముగా యువతులను వన్నె హెచ్చించుచునే క్లేశపెట్టెడు క్రూరుఁడు మన్మథుఁడుగాని వసంతపు టెండవేఁడిమి గాదు.

షండము=గుబురు.

ఆ. చిత్ర మేమొ నేను జిత్రరేఖను జూడ
నిపుడు కోరినట్టు లెపుడుఁ గోర;
తాపదీన మైనతఱి డెంద మన్నులఁ
బెల్లు దలఁచు ననుట తెల్ల మయ్యె. ౨౮

చిత్ర.—ఓహో! చెలి నన్నుం గనలేదు. ఇది మఱియు ననుకూలము. నేను డాఁగి యీ వృత్తముం బరికించి రహస్య మెఱింగెద. [అని యట్లు చేయును.

ఉష.—ప్రాణేశ్వరా, నిన్ను వెండియు నేఁ గాంతునో!

చిత్ర.—ఆహా! 'ప్రాణేశ్వరా' యనుచున్నది! నాతలంపే నిజ మైనది. వృత్తమి ట్లుండ శీతలోపచారముల నేమి ప్రయోజనము?

క. మండునిదాఘముచేఁ గల
గుండై పసిచెడినబండిగురివెందలతక్
వెండియు విలసిలఁ జేయఁగఁ
బండితుఁ డామనియ గాక పన్నీ ర్లగునే! ౨౯

మఱి యెవ రాధన్యుఁడు?

ఉష.—ఇఁక నేను ఈవిరాళికి దేహమును ధరింపఁజాలను.

చిత్ర.—ఆహా! ఎంతబలీయ మైనయనురాగము.

ఉష.—చీచీ! ఏల కలిగినది యీపాడులజ్జ! నారెండవమేనికి చిత్రరేఖకు అపరాధ మొనర్చితిని.

చిత్ర.—ఏమి యపరాధము? ఎట్లు?

ఉష.—హా! చిత్రరేఖకుఁ జెప్పక నారహస్యమును దాఁచితిని.

చిత్ర.—ఆహాహా! ఏమి నామీఁదికూరిమి!

ఉష.—చిత్రం దలఁచిన ప్రత్యాశ కలుగును. చెలి యట్టియుపాయశాలిని.

---

౨౮ ప.— తా.—తాపముచే దిగులుపడి యున్నప్పుడు హృదయము ఆప్తులను చూడ మిక్కిలి కోరు నన్నమాట స్పష్ట మయినది.

౨౯ ప.—నిదాఘము=వేసవి. ఆమనియ=వసంతుఁడే.

ప్రత్యాశ=ఆశ తీఱు నను నమ్మకము.

తే. చెలియ నాదుగుట్టు తెలియు నం చలికితిఁ,
దెలియదాయె నేమి తెన్ను నాకు !
తల్లి నేమఱించి వెళ్లి తోఁటకుఁ గాంచి
తల్లిఁ బనవు లేడిపిల్ల నైతి. ౧౬

అట్లు కాదు, ఆశ నన్ను వెక్కిరించుచున్నది. స్వప్నవిహారవిషయమున చిత్రయేనియు నేమి సేయఁగలదు.

చిత్ర.—ఏమి యద్భుతము ! ఏమి యద్భుతము ! స్వప్నమునం బ్రాణేశ్వరునితో విహరించినది నాప్రియసఖి. అధన్యనికై యీవిరాళి.

ఉష.—సఖి నాకడ కేల రాదు నేఁడు ! నా నేరమి దిద్దుకొని క్షమ వేఁడి జీవితము ననంగవ్యాఘ్రుని కిచ్చి శాంతిం బొందెద.

చిత్ర.— ఈ మెపలుకులలో నే అతఁ డెవరో తెలియునో చూచెద.

ఉష.—చెలి వచ్చునంతలో నాశిశువులం గని యామంత్రించెద. [అని ఆయా లతావృక్షముల నుద్దేశించి]

చ. కురవక పుత్త్రికా, తిలక కూర్మిమిత్త్రుఁడ, మావి యల్లుఁడా,
యఱిదిగఁ బుష్ప మొందె సొబగారెడుచంపకవల్లి పుత్త్రికా,
తఱిలెద మిమ్ము వీడి యొకతావునకున్, సరి యింతతోన మీ ౧౭
మ్మురమునఁ జేర్చి కాంచి కయిన్నొత్తి మోమున రాగ మూనుటల్.

[అని ఆయాతరులతలను యథోక్తముగా సంభావించి నల్గడ లరసి] ఆహా ! నాకంటికే మసగపడుచున్నది !

౧౬ ప.—అలికితిన్ = భయపడితిని. పనవు = ఏడ్చునట్టి.

విరాళి = వియోగదుఃఖము. ఆమంత్రించెదన్ = సెలవుగొనియెద.

౧౭ ప.—కురవక = ఓ గోరంటా. తిలక = ఓ బొట్టుగుఁ జెట్టా. మావి = మామిడి. పుష్ప మొందె = పువ్వులు పూచి (రజస్వలవై). సొబగు ఆరెడు = అందములుగులుకు చున్న. కయిన్ ఒత్తు ఇడి = చేతితో ఒత్తి (మీచేతులకు ఒత్తు లనెడి యాభరణములను బెట్టి). ప్రమదలు ఉరమునఁ జేర్చుట, చూచుట, చేతితో తాఁకుట, ముఖరాగము చూపుటయు వరుసగా కురవక తిలక సహకార చంపకములకు పూత గలిగించెడి దోహదములు.

ఉ. ఎక్కలితేఁటిబొగ్గుగమి నీతలిరుంగుమిఁగొల్మినిప్పుపైఁ ౨౮
జక్కఁగఁ బేర్చి మారునికిఁ జైత్రుఁడు దక్షిణవాయు వూఁదఁగా,
నుక్కటశోకకోరకశరోత్కర మెఱ్ఱఁగఁ గాల్చు; నయ్యయో!
యిక్కడ నిల్వఁజాల; నిఁక నెక్కడి కేఁగుదు నేమి సేయుదున్!

అయినను ఎటకేనియుం బోయెద. [అని పరిక్రమించి] హా! ఈతావు దానికన్న దుస్సహముగా నున్నది!

మ. కొరడా వ్రేటులు గాఁగఁ బైపయికి జోగున్ వల్లికాకోటి; బం
భరసేనల్ గయిగాళ్లసంకెలలుగాఁ బాటిల్లెడున్; మాకరం
దరసాసారవితప్తలోహమయదండవ్రాతసంప్రోతపం ౨౯
జర మయ్యెన్ బువ్వుఁదోఁట; నాకిచట నేజాడన్ శుభం బయ్యెడున్!

చిత్ర.—సత్యము, చెలిమీఁద నిట దురమే విరచిత మగుచున్నది!

శా. వాయవ్యాస్త్రము దక్షిణానిలము, భాస్వత్పల్లవవ్రాత మా
గ్నేయాస్త్రంబుఁ, బ్రఫుల్లకాంచనసుమానీకంబు బ్రహ్మాస్త్రమున్,

---

౨౮ ప.—ఈచోట వసంతుఁడు అను కమ్మరి ఈచిగుళ్లనెడి కొలిమి నిప్పుమీఁద తుమ్మెద గుంపు లనెడి బొగ్గు మొత్తములను పెట్టి, దక్షిణపుగాలి యనెడి తిత్తిగాఁడు తిత్తి యూఁదుచుండఁగా, అశోకపు మొగ్గ లనెడి యుక్కుబాణములను ఎఱ్ఱఁగా కాల్చి మదనునికి ఇచ్చుచున్నాఁడు! కావున ఇచ్చోట నే నుండలేను! మఱియెక్కడికి పోదును? ఏమి చేయుదును?

౨౯ ప.— ఇచ్చట, తీఁగల సమూహముల పైకొమ్మలు కొరడాదెబ్బలుగా నామీఁదికి ఊఁగుచున్నవి; తుమ్మెదల బారులు చేతులకును కాళ్లకును సంకెలలుగా చుట్టుకొనుచున్నవి. ఈ పూఁదోఁట చెట్లనుండి కాఱుచున్న మకరందధార లనెడు కాల్చిన యినుపశలాకలతో చేసిన పంజరముగా నున్నది. ఇట నున్నచో నాకు క్షేమ మెట్లు గలుగును?

దురము=యుద్ధము.

30 ప.— ఈ మలయమారుతమే వాయవ్యాస్త్రము, మెఱయుచున్న యీ చిగుళ్లగుంపే ఆగ్నేయాస్త్రము, వికసించిన సంపెంగపూవులమొత్తమే బ్రహ్మాస్త్రము,

స్ఫాయత్కోకిలకాహళార్భటి యిదే నారాయణాస్త్రం బయో!
కామోత్పన్నుఁడు నాలుగస్త్రములతోఁ గాటించెడిన్ నెచ్చెలీ!

ఉష.—నాలోలితావునకే పోయెద. [అని పరిక్రమించి, కని,] ఏమి యిది, యీనాముద్దులకూనలందు ఈపువురాసులు! ఈతేనెసోనలు! ఇ దేమి యింద్రజాలమా! ఓహో కాదు కాదు.

(తరళము.)

కడిఁదిపూఁతయుఁ గాదు, తేనియక్రందువైఖరి గా, దిదే
విడిచి యేఁగెద నన్నుమాత్రన విన్ననై యివి దిగ్గనన్
ఒడలు వే నయనంబులై నయనౌఘ మెల్లను బాష్పమై,
విడకు మమ్మని చూడ్కులన్ నను వేఁడుతీ రిది చూడఁగాన్. ౩౧

[మదనబాధ నభినయించి] అహహా! ఏమి యివి! న స్నేఁచుచున్నవి! ఇవి నిక్కముగా పూములుకులే. అయ్యో! నాకూనలారా,

(తరళము.)

పుడికి బుగ్గలు ముద్దుగొంటిని; బుచ్చి చుంచులు దువ్వితిన్;
గడకు మీరును వైరిపక్షమె కన్నలార యి ట్లైతిరే!
పుడమి నింతటివంత యుండునె, పోలునే మనఁగా సిఁకన్!
గడిఁదిమారునిచిత్రరేఖకుఁ గాన్క నాయుసు రిచ్చెదన్! ౩౨

హా ప్రియసఖి! [అని మూర్ఛిల్లును.

వ్యాపించుచున్న కోకిలకాహళా (సన్నాయి) ధ్వనియే నారాయణాస్త్రము; అయ్యో! ఇచ్చట మన్మథుఁడు ఈనాలుగస్త్రములతో చెలిని ఉషను బాధించుచున్నాఁడు. [బ్రహ్మ బంగారుబొజ్జవాఁడు చంపకము బంగారువన్నెగలదియు కాంచన నామము కలదియుఁ గావున దానికి బ్రహ్మాస్త్రసామ్యము, నారాయణుఁడును కోకిలయు నలుపు, కావున సామ్యము.]

౩౧ ప.—కడిఁది=అధికమయిన. క్రందు=తలుచు. దిగ్గనన్ = తటాలున. ఒడలు=దేహము. వే=వేయి. నయన ఓఘము=నేత్రముల సమూహము.

౩౨ ప.—బుచ్చి చుంచులు=చిన్నపిల్లజుట్టులు. వైరిపక్షమె = మన్మథునిపక్షమే. కన్నలార=నన్నుఁ గన్నతల్లులార. వంత=దుఃఖము. మనఁగన్=బ్రతుకుటకు.

చిత్ర.—[వడివడిగాఁ దఱిసి] హా! చిత్రరేఖా నీవు ప్రాణ మిచ్చెదవు! అహహా! ఎంత ప్రమాదము! ఎంత ప్రమాదము! నెచ్చెలీ, ఉషా, నేనే తప్పు చేసితిని. నేనే కూళను. నిన్ను వంచించి నీయాయాసముం గంటిని. నీతోడిదే కదా లోకము నాకు. నేను లేక నీ వెట్లు? [అని యుష నొడి నిడుకొని] ఆశ్వసిల్లుము సఖీ, ఆశ్వసిల్లుము.

(స్రగ్విణి.)

లేవె లేవే, సఖీ! లేవె నన్ గానవే!
యిప్పు నే నొక్కఁడం చేఁ దలంతుంగదే!
కావవయ్యా హరీ! కావవయ్యా హరా!
జీవలోకం బిదే చీఁకటిన్ మున్గదే. 33

ఉష.—[ఆశ్వసిల్లి చిత్రలేఖకవుంగిట లేచి చూచుకొని] ఆహా! చిత్రలేఖా, ఇప్పుడు నీదర్శనముచే నాకుఁ గరము తాపోపశాంతి కలుగుచున్నది.

చిత్ర.—కర మేమి? నీమనోహరుని పేరు చెప్పుదువేని పూర్ణముగా నే తాపోపశాంతి యగును.

ఉష.—[ఆత్మగతము] ఏమి యిది! ఈవృత్తాంతము ప్రియసఖి కెట్లు తెలిసినది? ఎఱుఁగ దని తలంచితిని! [ప్రకాశము] సఖీ, నీకు అది యెట్లు తెలిసినది?

చిత్ర.—ఇతరవిషయములు పెక్కులు తెలిసినట్లే.

ఉష.—[ఆత్మగతము] ఈమెమార్గములు తెలియరావు. అటయిన సఖికి ఆమహాపురుషుని పేరుమాత్ర మేల తెలియదు? నే నుచ్చరింప వినఁగోరికగా నుండును. [ప్రకాశము] సఖీ, అంతటిపుణ్యమా నాకు? నా కది తెలియదు సఖీ.

చిత్ర.—ఏది తెలియదు?

ఉష.—నామనశ్చోరుని నామధేయము.

చిత్ర.—ఆశ్చర్యముగా నున్నది? అటయిన ఆమహానుభావుని యసాధారణ రూపరేఖావిలాసముల వర్ణింపుము.

ఉష.—శక్యమేని. [ఆత్మగతము] నే నెక్కడ, ఆయనను వర్ణించు టెక్కడ! అయినను చెలియాజ్ఞ? ఏమి సేయుదు! ఎట్టు లీలజ్జాసింధువును దాఁట నేర్తు!

చిత్ర.—[నిర్వర్ణించి, ఉషమెయిం దడవుచు,] ఇదేమి, సఖీ, నీమే నెల్ల పులకలమొలకలు నిండుచున్నవి?

---

33 ప.—ఒక్కఁడు=ఒక్కటియే.

ఉష.—[తన్నుతాఁ జూచుకొని]

ఆ. పులకపటలి గాదు, మోహనాకారుని
మొలకనగవు మదిని బొలసినంత,
సురిగి సన్నసన్న శోకాంధకారంబు
వలస పోవుతీరు వనజనేత్ర. 38

చిత్ర.—నీవు చెప్ప నక్కఱలేదు, ఈరోమాంచనక్రమముననే తెలియుచున్నదిలే, నీమనశ్చోరుఁడు నిన్నుఁ దేల్చినకేళిక్రమము.

ఉష.—సఖీ, నీప్రతిభ కగోచరము కలదా!

చిత్ర.—ఏదీ, మఱి వర్ణింపు మాయనస్వరూపమును, నాప్రణయము నుల్లంఘింపవుగదా.

ఉష.—మన్నింపుము సఖీ, చిత్తవృత్తి కుదురకున్నది.

చిత్ర.—[ఉషను నిర్వర్ణించి]

ఆ. హా! యిదేమి సకియ రేయెండ దాఁకిన
తమ్మివైరిశాతిబొమ్మ వైతి!

ఉష.—

ప్రాణనాథుసరసఁ బాసినవలవంత
నంగకములు గురియునశ్రువు లివి. 39

చిత్ర.—నిన్నుఁ గన్న నీకై యతఁడును ఇట్టియవస్థనే పొందును. చంద్రునికై రోహిణి యెట్లో చంద్రుఁడును రోహిణికై యట్లే యువ్విళులూరునుగదా.

ఉష.—సఖీ, నీపల్కులు ఆశాజనకములు, దీవెనలు, యోగదృష్టవిషయములుగాఁ దోఁచుచున్నవి.

చిత్ర.—అట్లే అగుఁగాక. మఱి నీవల్లభుని స్వరూపముం జెప్పుము.

---

38 ప.—పులకపటలి=గగుర్పాటుయొక్క సమూహము. రోమాంచనక్రమముననే=గగుర్పొడిచినవరుసవలననే.

39 ప.—రేయెం...వైతి=వెన్నెల తగిలిన చంద్రకాంతశిలాప్రతిమ కరఁగినట్లు నీవు చెమరు దాల్చితివేమి? వలవంతజ=వియోగ దుఃఖముచేత. అంగకములు=నాయవయవములు. అశ్రువులు=కన్నీళ్లు.

ఉష.—అనిర్వచనీయముం జెప్ప మనుచున్నావు.

చిత్ర.—వెండియు యత్నింపుము.

ఉష.—నీయాజ్ఞ.

ఆ. ఒకరిబోటివాఁడు లోకమాత్రమును గాఁడు,
ఎల్లసొబగులందు హెచ్చువాఁడు,
మంచిరీతికెల్ల మందిరం బగువాఁడు,
పొచ్చె మేమి లేక పొలుచువాఁడు. ౩౬.

చిత్ర.—బళిబళి! అయినను ఇట్టివర్ణన ఎంత యేనియు నొక్కనామమునకు సరిగాదు గదా! వాస్తవముగా నట్టిపురుషుఁ డుండు నేని నే నతని నెఱుంగకయుండను.

ఉష.—'వాస్తవముగా' అనుమాటచే నాకు దిగులు గలుగుచున్నది.

చిత్ర.—భయపడకు, అతనిప్రతిమను వ్రాయుము. సాధనములం దెచ్చెద. [అని, పోయి రంగులపెట్టెయు పటంబులును గొని వచ్చి యథోచితముగ నుంచి] మఱి కానిమ్ము, నారదులవారికృపచే నీత్రిజగతియందు నే నెఱుంగనివారు లేరు.

ఉష.—[ధ్యానించి] ప్రియసఖీ, మహానుభావురాలా, ఇదె యత్నించెదను.
[అని వ్రాఁత నభినయించి, కన్నీళ్లు వెల్లి గొనుటయు, వ్రేళ్లు చెమర్చుటయు వణఁకుటయు, సూచించును.

చిత్ర.—[నిర్వర్ణించి, నవ్వుచు,] చెలీ, ఏమి యిది! చివరకు అగంభీరవేదిగాఁ డేనా నీమనోదయితుఁడు!

ఉష.—[ఉలికిపడి] వానిం బేర్కొనకుము సఖీ. హా! నాకన్న మందభాగధేయలు ధరిత్రిఁ గలరే?

ఉ. నాహృదయంబు తల్లడిల, నాయన నన్ను గభీరవేది కు
ద్వాహము సేయఁ బూనెఁగద,
చిత్ర.— దంతికిఁ దామరతీవియల్ బలెన్;
ఉష.—
సాహసవర్తనంబునకుఁ జాలను నాయనమ్రోల; నెట్టులీ
మోహము దెల్పుదాన నెటు మోడి వహించెడిదానఁ! జెప్పుమా.

---

అనిర్వచనీయము=చెప్పుటకు మాటలు లేనిది.

౩౬ ప.—సొబగులు=అందములు; మందిరంబు=ఇల్లు; పొచ్చెము=కొఱఁత.

౩౭ ప.—ఉద్వాహము = వివాహము; దంతికిన్ = ఏనుఁగునకు; మ్రోలన్= ఎదుట; మోడి=మూర్ఖతను.

అయ్యో ! న న్నేల సృజించెనో విధి ! సఖీ, మృత్యువు దప్ప నాకు శరణము గలదా !

చిత్ర.—నాసాముద్రికజ్ఞానమున నీకు నమ్మకము గలదేని నీరూపము దుఃఖమునకై పుట్టినది గాదు.

ఆ. కాదు భంగపాటు, కల్యాణ మగుఁ గాని,
నిష్కళంక రూప నిధుల కెందు;
రాహు వక్త్ర గోచరంబౌనె శశిరేఖ ?
పరమ శివుని మౌళిఁ బరఁగుఁ గాక. ౩౮.

ఉష.—నీ వేదేవతవు చెలీ?

చిత్ర.—మఱి గంభీరవేదిగా నింబోలె వ్రాసితి వేమి ?

ఉష.—[కన్నీళ్లు నించుచు] హా ! ఏమి చేయుదును ? మందభాగధేయను !

మ. చెలిరో, వ్రేళులు కంప మొంది ప్రతిమం జిత్రింపలేవాయెఁ; బి
చ్చిలులై జమ్మట లల్కి పుచ్చుఁ; గడుగన్ జిడ్డూడ దీబాష్పముల్ ;
బలుదప్పిన్ నది డాసి రేవెడసి జంబాలంబునం గూలితిన్ ;
లలనా, దైవము దాయయైనతఱి నేలా లగ్గు వాటిల్లెడిన్ ! ౩౯.

అయ్యో ! నేను వ్రాయఁజాలను సఖీ ! [అని యేడ్చును.

చిత్ర.—[కన్నీళ్లు తుడుచుచు] ఏడువకు చెలీ. నాయెఱుంగనివారు జగతిని లేరంటినిగదా. ఇదె చూడు, నే వ్రాసెద; నీ చెలువుని ఇందుం జూపుము.

[అని పటములు గొని వ్రాయును. ఉష ఆశ్వసిల్లి పరికించును.

చిత్ర.—[పటము జూపి] సఖీ, దర్శనమాత్రముననే నీనాయకుఁడో కాఁడో నీకుం దెలిసినను గుణోత్తరుల నిఁక స్వరూపకథనముచే సంభావించెద.

---

౩౮ ప.—చంద్రరేఖకు కళంకము లేదు, నిండు చందురునికి కలదు. రాహువు నిండు చందురుని మ్రింగును గాని చంద్రరేఖను మ్రింగఁడు. అట్లే ఉష నిష్కళంకరూప కావున ఆమెకు భంగము కలుగదు, కల్యాణమే కలుగును. చంద్రరేఖను శివుఁడు శిరమునఁ దాల్చినట్లు ఉషను భర్త తలకెక్కించుకొనును (గారవించును) అని భా.—

౩౯ ప.—పిచ్చిలు=జాఱుచున్న; అల్కి పుచ్చున్ = ప్రతిమలోని రంగలను ఒక్క మొత్తముగా కరంగించి కలిపి వేయుచున్నవి; రేవు ఎడసి=రేవునకు దూరమై; జంబాలంబున్=బురదలో; దాయ=వైరి; లగ్గు=మేలు.—చిత్రరేఖ నదివంటిది—కడకు భావ మూహించుకొనవచ్చును.

ఉష.—నీవాగమృతమును వీనులారం గ్రోలెద.

చిత్ర.—సఖీ, ఈతఁడు భగదత్తుఁడు ప్రాగ్జ్యోతిషాధీశ్వరుఁడు.

ఉ. అంతులు మీఱుదొమ్ములఁ జటాలున వీనికటారి వ్రేటులన్
గొంతులు ద్రెస్సి నెత్తురులు గుబ్బలివాఁకలపోల్కి దూఁకుటల్
వింత దలిర్చుఁ దన్నపుడె పెండిలి యాజయలక్ష్మి యాతఁడున్
సంతస మొప్పఁ గ్రోవుల వసంతము లాడెనుజాడఁగాఁ జెలీ. ౪౦.

ఇతఁడా నీమనోదయితుఁడు?

ఉష.—నామనోహరుఁడు కల్యాణమూర్తి గదా.

చిత్ర.—ఈమాఱు గనుము. [అని వ్రాఁత నభినయించి, పటము చూపి,] సఖి, ఈతఁడు సహస్రకిరణానిపుత్త్రుఁడు; సహజకవచకుండలుఁడు; కౌరవులదళవాయి; ఇతఁడు దానవీరుఁ డెల్లో అట్లే యుద్ధవీరుఁడును; ఇతనియాహవములయందు:—

సీ. చుక్కలెల్లను దోఁకచుక్కలై పెక్కులై । ఝంఝూభినయ మాడుచమరఁ జనంగ,
కరము లెల్లను గొఱకచ్చులై హెచ్చులై । మిడుతపోఁటు నటించువడువు వనఁగ,
మిడుఁగురులెల్లఁ గ్రొమ్మించులై మించులై । యొకపందెముగ దాఁటునోజ యనఁగ,
వార్ధిబాఁకెల్ల నౌర్వంబులై డంబులై । యిఱుకు లేనిపయోధి నెనయుటనఁగ,
తే. బుగులు వర్లంతు రితని కార్ముకమునుండి
యారి మొనలఁ గప్పు శిఖ పరార్ధములను;
తరుణి నీ చిత్తచోరుఁ డితండ యేని,
చెప్పుము, చేఁ పట్టి తెచ్చి నీచెంత నిడెద. ౪౧.

ఉష.—ప్రియసఖీ, నాదయితుఁడు ఒకరిసేవకుఁడు గాఁడు.

---

౪౦ ప.—గుబ్బలి వాఁకల పోల్కిన్=కొండ యేళ్లవలె; తన్ను=ఈరాజును; అపుడె=ఆయుద్ధసమయమందే; క్రోవులన్=గొట్టములతో (పిచికారులతో).

౪౧ ప.—చుక్కలు = నక్షత్రములు; పెక్కులు = అనేకములు; ఝంఝూభినయము = వానతోడి తుపానుగాలియొక్క నాటకమును; చమరు = సభ; కరములు=కిరణములు; మిడుతపోఁటు=మిడుతదండు పర్వుటను; వడువు=విధము; మిడుఁగురులు=నిప్పురవలు; క్రొమ్మించులు=క్రొత్త మెఱుపుఁదీఁగెలు; మించులు=అతిశయమైనవి; ఒక...ఓజ = పందెము వేసి దాఁటు విధము; వార్ధి = సముద్రముయొక్క; ఔర్వంబులు=బడబానలములు; డంబులు=అతిశయములు–పెక్కులు; పయోధిన్ = సముద్ర

చిత్ర.—అటయిన నీసూటు చూడుము. [అని వ్రాఁత నభినయించి, పటము చూపి,] సఖీ, యీతఁడు పాండవమధ్యముఁడు, పార్థుఁడు, అర్జునాది ద్వాదశాభిఖ్యుఁడు.

క. ఏఁకరె నీతనికై యల
నాకాంగన యుర్వశియు మనఃప్రభవాగ్నిన్;
చేకొని చని యీతని నిజ
లోకమునన్ నాగసతి యులూపి వరించెన్. ౪౨.

మఱియు నీతఁడు,—

సీ. నీడమచ్చెముఁ గన్చు నింగిమచ్చెము నేసి । కడిమిపందెపుమచ్చెకంటిఁ గొనియు,
ఒకతూరి వేల్పులయొకిమీని వీక్షించి । డంబు మీఱినకిరీటంబు గొనియు,
సురరాజుఁ ద్రోచి చిచ్చునకు ఖాండవ మిచ్చి । తఱుఁగనికవదొన లనువు గొనియు,
ముక్కంటియాదల నొక్కటి వడ్డించి । పాశుపతాస్త్రంబు పంచికొనియు,
తే. ఇట్టి త్రైలోక్యవీరుఁ డీయెమ్మెకాఁడు;
చెలియరో, యీతఁడే నీదుచెల్వుఁడేని,
చిన్నిచిన్నారినుడుల వచింపవమ్మ,
మీసములు వట్టి తెత్తు నీమోసలకును. ౪౩.

ఉష.—ఇంతకన్న సుకుమారుఁడు నాప్రాణవల్లభుఁడు.

చిత్ర.—[వ్రాఁత నభినయించి, పటము చూపి,]

మత్త. చూఁడు వీరల వాఁడిసింగపుసూఁటిపాఁజుల జాణలన్
బాడికోడియగబ్బికొమ్ములఁ బార్థుతమ్ముల నిర్వురన్

---

మును; ఎనయుట=చేరుట; కార్ముకమునుండి=ధనుస్సునుండి; అరిమొనలన్=శత్రువుల సైన్యములను; విశిఖ పరార్థములను=లెక్కకు మించిన బాణములను.

౪౨ ప.—ఏఁకరెన్=కృశించినది. నాకాంగన=దేవస్త్రీ - అప్సరస. మనఃప్రభవాగ్నిన్=మదనానలముచేత.

౪౩ ప.—మచ్చెకంటిన్=ద్రౌపది ననుట; వేల్పులయొకిమీనిన్=దేవేంద్రుని; చిచ్చునకున్ = అగ్నిదేవునికి; తఱుఁగనికవదొనలు=అక్షయతూణీరద్వయమును; ఒక్కటి=ఒకగ్రుద్దు-లేక-దెబ్బ.

౪౪ ప.—ఉషా, అర్జునుని తమ్ములయిన నకుల సహదేవులను ఈ యిరువురను చూడుము, పరాక్రమ మనెడి సింహముయొక్క సూటితప్పని పంజాలుగాను ధర్మ

నాడెపు న్జవరాలి గుబ్బల నర్షభుం గరి కోఅలన్;
జేడె నీదొర నిందుఁ జూపుము, చెచ్చెరం గొని వచ్చెదన్. ౭౭.

ఉప.—ఇంతకన్న సులక్షణుఁడు నావల్లభుఁడు.

చిత్ర.—[వ్రాఁత నభినయించి, పటము చూపి,]

(తరళము.)

ముదితరో, కనుఁగొమ్ము వీరల మోహనోజ్జ్వల మూర్తులన్
గొదలు దీఱ జయంతునిన్ నలకూబరున్ సుషమాభరున్
త్రిదశనాయకుముద్దుఁబట్టి నుదీచినాయకుపట్టినిన్;
మదిరలోచన, నీప్రియుం జెపుమా యిటం గనుపట్టినన్. ౭౮.

ఉప.—సఖీ, ఇట్టిసామాన్యులను వ్రాసెద వేల ?

చిత్ర.—అటయిన, ఈమూఱు గనుము. [అని వ్రాఁత నభినయించి, పటము చూపి,]

శా. వర్ణింపన్ నను బోంట్లకౌనె సఖి యీద్వారావతీవల్లభున్
అర్ణోరాశిసుతా మనోహరుని విశ్వాత్మున్ స్థితివ్యాపృతున్
శీర్ణావిద్య హృదంబుజోదర మహాసింహాసనాధ్యాసునిన్
బూర్ణుం గేవలుఁ గేళిమానుషతనున్ భోగీంద్రతల్పున్ హరిన్.

మ నెడి వృషభముయొక్క గుబ్బకొమ్ములుగాను, అంద మనెడి గుబ్బెతయొక్క గుబ్బలుగాను కేళియ నెడి యేనుఁగుయొక్క కోఅలుగాను ఉన్నారు. (తుల్యులు పరాక్రమవంతులు ధర్మవంతులు సుందరులు, కేళికుశలులు అని భా.) నీనాయకుఁడు వీరిలో నొకఁడేని చెప్పుము; తత్క్షణమే పోయి తెచ్చెదను.

౭౮ ప.—ముదితరో=ఓచేడియా; కొదలు తీఱన్=కొఱఁతలు తీఱునట్లుగా-తనివి తీరునట్లుగా; జయంతుండు త్రిదశనాయకుని (దేవేంద్రుని) ముద్దుఁగుమారుఁడు, నలకూబరుఁడు ఉదీచినాయకు (కుబేరుని) కుమారుఁడు; సుషమాభరున్=ఉత్కృష్టమయిన శోభను భరించువానిని-అత్యంతప్రకాశమానుని [ఇది జయంతి నలకూబరులకు విశేషణము]; మదిరలోచన=చూచువారికి మద మెక్కించు నేత్రములు గలదానా.

౭౯ ప.—సఖీ, ద్వారకానాథుఁడును (క్షీర)సాగరకన్య యగుమహాలక్ష్మియొక్క చిత్తమును హరించినవాఁడును, ప్రపంచ స్వరూపుఁడును, ప్రపంచరక్షణమందు పనిచేయువాఁడును, ఎవరికి అవిద్య (అహమ్మతి) నశించినదో వారి హృదయకమల మనెడి సిం

ఉష.—నీమహిమ నాకు వెఱఁగగుచున్నది !

క. నాలుకలో శారదయుక్,
దూలికలో నజుఁడవుఁ, గ్రాలుదురు నీకుఁ జెలీ;
కేలక్ లిఖయించుటగాఁ
గైలాటము సల్పి నన్నుఁ గలఁగింతు గదే ! ౪౭.

చెలీ, నన్ను వెక్కిరించుటకా నన్ను ముందు వ్రాయు మంటివి?

చిత్ర.— ఈవేమాయలవాఁడేనా నీమనోదస్యుఁడు?

ఉష.—ఈయన కాఁడు. (వణంకుచుం గేలు మోడ్చి) ఈయనం గనఁగా నాయెదను భయ భక్తి సంభ్రమంబులు పొడముచున్నవి ! నా ప్రాణదయితుఁ డీపాలిక నుండును.

చిత్ర.—ఆహా ! ఏమి నీభోగము ! ఏమి నీతలిదండ్రులభాగ్యము ! [అని మరల వ్రాసి, చూపి,] ఈమూఱు కనుము.

సీ. నీకన్ను లీడోదు నెఱనిగ్గుఁ డెక్కెముల్, నీయాస్య మీడార నేస్తకాఁడు,
నీయూర్పు లీతేని నిఖిల చైత్రరథంబు, నీపల్కు లీరాతు నీటుఁ దేజి,
నీదుమే నీశూరు నిర్నిద్రచాపంబు, నీరోమరాజి యీపిరుమౌర్వి,
నీనడు మీదేవు నిరుపమాకారంబు, నీదులావణ్య మీనేత తాత,

- - - - - - - - - - - - - -

హాసనమందు కూర్చుండువాఁడును, నిండిన వాఁడును, అద్వితీయుఁడును, లీలార్థమైమానుష దేహమును దాల్చినవాఁడును, నాగేంద్రశయానుఁడును అయిన యీశ్రీకృష్ణుని వర్ణించుటకు నా బోంట్లకు శక్యమా.

౪౭ ప.—శారద=వాగ్దేవి; తూలిక=ప్రతిమను వ్రాయుకుంచె; అజుఁడు=బ్రహ్మదేవుఁడు; [సాక్షాత్సరస్వతివలె అద్భుతకవనముతో వర్ణించుచున్నావు, బ్రహ్మవలె (పటమునందు) మూర్తులను సృజించుచున్నావు అనుట.] కేలక్=చేతితో; కైలాటము=మాయ; కలఁగింతు=కలఁతపెట్టుచున్నావు.

దస్యుఁడు=దొంగ.

౪౮ ప. ఇది మన్మథావతార మయిన ప్రద్యుమ్నుని వర్ణన. వరుసగా—నీకన్నులు మచ్ఛములు, నీనెమ్మొగము చంద్రుఁడు, నీశ్వాసము మలయమారుతము, నీ వాక్కు-చిలుక, నీశరీరము పుష్పము, నీనూఁగారు తుమ్మెదలబారు, నీకు నడుము లేదు, నీ దేహకాంతి పాలసముద్రము, నీ యడుగులు చిగుళ్లు, అని భావము; ఈ చెప్పిన యుపమానములు మన్మథునికి వరుసగా ధ్వజము మిత్త్రుఁడు విజయరథము వాహనము విల్లు నారి అం

తే. నీపదచ్ఛాయ యీతనిప్రాపుసురియ,
సిరికి సిరి, చిట్టకములకుఁ జిట్టకంబు,
అందముల కంద, మితఁడ నీయనుకుఁడేని,
భాగ్యవతులందు సకి నీవె భాగ్యవతివి. ౪౮

ఉష.—[కేల్మోడ్చి వణఁకుచు] ఆహా! ఏమి నీమహిమ! నావల్లభుఁడు కేవల మిట్లే యుండును. కాని, ఈయనప్రోల నే నిలువఁజాల. ఈయనను నేను కొలువుడుఁగత్తెను గాని దయితం గాను. నాసామి యింతకన్నం గోమలాంగుఁడు.

చిత్ర.—మతి యీమాఱు గనుము. [అని వ్రాయును.

ఉష.—ఆహా! దఃమాఱు నీవు వ్రాయుచున్నావు!

[అని హర్షాశ్చర్యములు పెనంగొన నిర్వర్ణించును.

చిత్ర.—

వృత్త. భూరిపుణ్యము జన్మకోటులఁ బ్రోపు సేయనివారికిన్
దీరు సూడఁగనేని యందని ధీర కాంత శరీరునిన్
శూరునిన్ గుణి వీరునిన్ బుధు సూరి గేయ విహారునిన్
మారు ముద్దుఁగుమారునిన్ సుకుమారునిన్ గనుమా చెలీ. ౪౯.

[ఉష చిత్రరేఖం గవుంగిలించును.

చిత్ర.—ఈమహాభాగుఁడేనా నీసామి?

ఉష.—[లజ్జతో] అవును.

చిత్ర.—బళిబళి! కృష్ణపౌత్త్రుని ప్రద్యుమ్నపుత్త్రుని అనిరుద్ధకుమారుని వరించిన నీకన్న నెవ్వతె ధన్యురాలు! హరివంశమునం దక్క మహాలక్ష్మి మతి యెటం జేయును!

గము (మదనునికి దేహము లేదుగదా) మాతామహుఁడు నై యుండుట ప్రసిద్ధము; కావున ఈతఁడు ప్రద్యుమ్నుఁ డని భావము; నిఖిలజైత్ర = ఎల్లవారిని జయించునట్టి; నిద్రా=అమందమైన; చాపంబు=విల్లు; నిరుపమ=సాటిలేని; నేత=దొర; ప్రాపుసురియ=ముఖ్యసాధనమయిన సురకత్తి; చిట్టకము=శృంగారచేష్ట; అనుకుఁడు=ప్రియుఁడు.

౪౯ ప.—విస్తారమయిన పుణ్యమును అనేకకోటిజన్మములయందు ప్రోగు చేసికోనివారికి ఇతనితీరును చూచుటయైనను ఘటింపదు. అట్టి యీతఁడు గంభీరమనోహరమూర్తి పరాక్రమవంతుఁడు గుణవంతుఁడు ఉత్సాహవంతుఁడు విద్వాంసుఁడు జ్ఞానులు మెచ్చి పాడఁదగినవర్తన కలవాఁడు ప్రద్యుమ్నుని ముద్దుఁగుమారుఁడు కోమలాంగుఁడు. ఇతనిం జూడుమీ ఓ నెచ్చెలీ.

ఉష.—ప్రాణసఖీ, నీమహిమ యనిర్వచనీయము! ఇది మొదలు నేను నీదాసిని.

చిత్ర.—కావు, నాప్రాణమవు. [అని కడమపటముల నుఱుమాడి దాఁచును.

ఉష.—[అనిరుద్ధప్రతిమ నుద్దేశించి] ప్రాణేశ్వరా,

(దక్షిణాంతిక.)

నవనీత సనాభి మూర్తి వై
పవిధారా పరిభావి గా మదిన్
సవరించితి సామి యేలొకో
వివరంబున్ వినిపింపుమా యుషన్. ౫౦.

చిత్ర.—ఆయన నుపాలంభింప నేల? స్వప్నమే గదా. నీవృత్తాంతము ఆయన ఎఱుంగఁడేమో? అట్టియుదారప్రకృతులు దయాదూరములు గానేరవు.

ఉష.—సత్యము సత్యము. నీ వెప్పుడును వివేకమంజులవు. [ఆలోచించి] ఎఱుఁగనిచో ఆమహాభాగుఁడు ఈమందభాగ్యను సరకుగొనునా?

చిత్ర.—ఎఱిఁగినచో, 'ఈమందభాగ్యని ఉష సరకుగొనునా' యని యామహాభాగుండును వచించును.

ఉష.—సఖీ నీ వాశ్వాసము పలుకుచున్నావు.

చిత్ర.—నే నెప్పుడును వివేకమంజుల నంటివిగదా.

ఉష.—నీచిత్తము.

చిత్ర.—నీవల్లభుని ఈమందాకినీప్రాసాదమునకుం దెచ్చెద.

ఉష.—[కవుంగిలించి] ఏల నాతోఁ బుట్టవైతివి?

చిత్ర.—ఇంతటియనురాగము ఉండదని.

ఉష.—[చిత్రరేఖం గవుంగిలించి ముద్దుగొని] నానాలుక కృతజ్ఞతాజడ మై యున్నది. ఏమియుం బలుకనేరకున్నాను. [ఆశ్చర్యముతో కవుంగిలి సడలించి] ఏమి యిది! నీమొదలును ఇంత వేఁడిగా నున్నది.

---

నుఱుమాడి=చింపివైచి.

౫౦ ప.—ఓసామీ, వెన్నకు తోఁబుట్టువైన రూపము కలవాఁడ వయ్యును నీహృదయమును మాత్రము వజ్రాయుధపు వాదరకన్న కఠినముగా చేసికొంటివే, అందుల కేమి కారణమో ఉష నయిన నాకు వివరించి చెప్పుము.

చిత్ర.—[నవ్వుచు] నీకాఁగిట నాలసే వుంటిని గదా.
ఉష.—నిజము చెప్పవా?
చిత్ర.—[నవ్వుచు]

క. ప్రాణంబు ప్రాఁగెనేనిన్,
మేనుం దాఁ బ్రాఁగు టరుదె మేదినిలోనన్?
ప్రాణమవు నీవు ప్రాఁగిన,
మేనను నేఁ బ్రాఁగితిని దమీరారమణాస్యా. ౧౧.

ఉష.—మృషవచించుచున్నావు. కానీ, తర్వాత ఎటకుం బోయెదవు!
మదనికాకుముదికలు.—[ప్రవేశించి]ఇదిగో చందనక్షీరము.

చిత్ర.—ఉష యిప్పటికి స్వస్థపడినది. ప్రకృతము ఉషను కర్పూరసరసికిం గొనిపోయి జలక మాడించి యీమదనప్రతిమను,— ఆహా! ఇందు కేలం బూవిల్లు వ్రాయ మఱచితిని! ఇదె వ్రాసెద. [అని అట్లు సేయుట నభినయించి] ఈమదన ప్రతిమను పూజసేయింపుఁడు. [అని యాపటము నుషచేతి కిచ్చి] తర్వాత ఉషను మందాకినీప్రాసాదమున వదలుఁడు. నేను ఉషకు అప్రతిరుద్ధోపచారముం దెచ్చెదను.
మద., కుము.—నీయాజ్ఞ.
చిత్ర.—ఉషా, నేను పోయి తెచ్చెదను. [అని పైకి సాగి]

భుజంగ. జోహారో కపాలీ, జోహారో కరాళీ,
జోహారో గురూ, నాసుతన్ బేళలాంగిన్
గోహార్త్నేయు దగ్గాంగు చెయ్యంబు దిద్దన్
మహామాయ, నాకున్ మహాసిద్ధి యిమ్మా. ౧౨.

[అని నిష్క్రమించును. కరేణుక తొంగి చూచును.
మద.—రారమ్ము ఉషా, కర్పూరసరసికి. చిత్రరేఖ ఎవరో దేవత. ఆమెమాట మనము జవదాఁటఁగూడదు. [అని ముగ్గురు నిష్క్రమింతురు.

---

౧౧ ప.—తమీరారమణాస్యా=నిశానాథవదనా=చంద్రముఖీ.

౧౨ ప.—పునుకదాల్పపైన యోశివుఁడా, నీకు నమస్కారము; చండీదేవీ, నీకు నమస్కారము. ఓ గురూ నారదమునీ, నీకు నమస్కారము. కోమలమూర్తి యయినయీ రాజకన్యను ఉషను కాలిపోయిన మన్మథుఁడు చంపు చున్నాఁడు. వాని చెడుచేఁతను దిద్దుటకై, ఓ,మహామాయాదేవీ, నాకు ఉత్తమ మయిన ఆకాశయానాది కార్యసిద్ధిని అనుగ్రహింపుము.

కరే.—[ముందఱికి వచ్చి] వుషకి యెండదెబ్బ తగిలిందని నాతో మదనిక చెప్పింది. [నిర్వర్ణించి] యీతామరాకులపడక దానితాపాన్ని పోగొట్టిందిగదా. గంభీరయ్యమీదిమర్లుమూలంగా నావొళ్లు వుడుకెక్కి పోతూవుంది. యీపరుపుమీద నేను చల్లబడతా. [అని యీతామరసెజ్జపైఁ బడి దొరలుచు] నాకు మొదలే వుషమీద మహాప్రేమ. దానికి నారాయడిమీద మనసులేదుగనక యిప్పుడు చెప్పాలిశిందేలేదు. యీపరుపుకోసం కూడా నాకు దానిమీద ప్రేమే. [దొరలుచు] సీత్, యిది నా కేమూలకి? యిదేమి వేడిగావుందే! వోయి బాబో! రోగం వొకచోటే అయినా అందఱికీ వొకచోటే మాత్ర పనికిరాదని మునుపు వైద్యులన్నారు. మాతత్వాలు వేఱుగదా. అదిసన్నగా తెల్లగా గోతేస్తూ వుంది. నేను గుండ్రగా నల్లగా ముద్దొస్తూవున్నాను. అయితే వెలపలికి వేడయితే లోపలికి చలవట, చిత్రమూలంలాగ. కనక లోపలికాక పోవడానికి వీట్ని తినేస్తా.[అని అట్లే చేసి] యివి నా కేమూలకి! మాయింటికాడి పెద్దచెఱువులోపడి అందులో వన్నీ తినేశి ఆచన్నీళ్లన్నీతాగేస్తా. చన్నీళ్లకంటే చలవ మళ్లేదు. పాడతా.

నేను గంభీరుణ్ణి పెళ్లాడితే, బళీ! నేను..., వవ్వా! నేను..., సెబాస్!
నే నాతడికి కూడు వొండిపెడ్తాను.
నన్ను గంభీరయ్య పెళ్లాడితే, బళీ! నన్ను..., వవ్వా! నన్ను..., సెబాస్!
నాకాతనూ మంచి నగలు పెడ్తాడు.

వొరులు నన్నూ నవ్వకుండా, బళిబళీ! వొరు..., బాపురె! వొరు...,
సరికి సరి గానె వొలిచితిని. ,, సరి... ,, సరి....
కొండలూ జంటల లాగ, ,, కొంద.., ,, కొంద...,
ఎందునా మేము పోరాడం. ,, ఎందు.... ,, ఎందు....
పొంతనా ల్యాళ్లకీ కుదరా, ,, పొంత..., ,, పొంత...,
అంతాను మాకూ కుదిరికే. ,, అంతా... ,, అంతా....
కడుపూ, కుడుపూ,
నలుపూ, బలుపూ, అంతా.... ,, ,, ,, ,,
జగడం, నగడం,
అరనడం, కరవడం, ,, ,, ,, ,, ,,
అన్నిటికి పైగా అడ్డగా పెరగడం. ,, ,, ,, ,, ,,

[అని వికృతనాట్యము లాడి నిష్క్రమించును.

ద్వితీయాంకము ముగిసినది.

---

# ప్రవేశకము.

స్థలకము :—ద్వారక, శ్రీకృష్ణప్రాసాదోద్యానము.

ఉద్యానపాలిక ప్రవేశించి

తోఁట నలంకరించుచుండును.

ద్వితీయ.—[ప్రవేశించి] వొశే బంబరికా, యేమే నువ్వింకా యీతోటని అలంకరింపకున్నావు, కొమారమహారాజు అనిరుద్ధులవారికి మరీ యిష్టమైనతోట గదటే యిది!

బంభరిక.—వొశే కీరవాణీ, నీపని రవ్వంత ముంగట అయిందని యేంబడాయే నీకు! యిదుగో ముగించాను చూడు. మరి మొన్నడిగితే ఆనక చెస్తానన్నావే యిప్పుడు చెప్పు, మునుపంతా యెప్పుడో యిక్కడికొచ్చే కొమారమహారాజు యిప్పుడు రోజల్లా వొంటరిగా యీతోట్లోనే తిరుగుతూ వుంటాడే అదేమిటి?

కీరవాణి.—ప్రెబువులచిత్తానికి కారణం యెందుకే!

బంభ.—మరి, జక్కవపిట్టలని జతలుకట్టి వాటిమీద యేమిటేమిటో చిత్రాలు రాస్తాడే అదెందుకే?

కీర.—నువ్వెకగోడవే! వీటికోసమే. [అని బంభరిక పాలిండ్లం బొడుచును.

బంభ.—ఎగతాళటే?

కీర.—కాదు దిగతాళే. ఎవతెమీదనో మనసుపడ్డాడే.

బంభ.—పడితే?

కీర.—ఆమెది అవే యివని వీటికి ఆలాగ అలంకారాలు చేస్తాడు.

బంభ.—నెమలిపిట్టల్ని పట్టుకొని వాటికుంచెలు దువ్వి వాటికి పువ్వులు ముడ్తాడే అదెందుకూ?

కీర.—వొకటి చెప్తే కడమన్ని తెల్సుకోలేవటే? ఆమెతలకట్టు తలుచుకొని వీటికి శేవలు చేస్తున్నాడు.

బంభ.—శబాస్ శబాస్. మరి ఆగుడ్డిచెంబడికి వాకకాడ తెలవనీకుండా వాడిగాలానిముల్లు తీశేశి వుత్తతాటికి జిలేబీలు కట్టినాడు నిన్న, వాడికి తెలవనీకుండానే వాడిబుట్టలో వొరాలపొట్లం వేశినాడు.

కీర.—చాపలు ఆబాగ్గెమంతురాలికళ్లలాగున్నాయట. అటుపైని తెల్సుకో. చాపలు పడకుంటే ముసలివాడికి మేపకు ల్లేవని వొరాలు పడేశినాడు.

బంధ.—నువ్వెక్కడ్నో మడకని పడ్డావే.

కీర.—రాయే లంజా, నువ్వు కూడా పడుదు గాని.

బంధ.—యింకొకటిమాత్రం చెప్పు. ఆవాకిలోకి దిగి ఆయ నెందుకే ఆసుళ్లని వెతికివెతికి ముద్దెట్టుకొంటాడు ?

కీర.—చాల్లే యీపాటికి. నువ్వెవణ్ణయినా వొకరంగణ్ణి తగులుకొని రాత్రి వాణ్ణడుగు చెప్తాడు. నీకేమి చీకటిబయం లేదటే ? [అని నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

---

మడకని = మడకలో = అరకలో. మడకని బడ్డావే = పురుషునిం బొందితి వని భా.

# తృతీయాంకము.

స్థలకము :—మునుపటిదే.

చిత్రరేఖ ఆకాశయానమున ప్రవేశించును.

చిత్ర.—ఆయుద్యానపాలికల సంభాషణవలన కుమారమహారాజు అనిరుద్ధుఁడు ఏధన్యురాలికొఱకో విరాళిం గూరుచున్నాఁడని తెలిసెఁగదా. తిరస్కరిణీప్రభావంబున రాచనగరు సొచ్చి యామహాపురుషుం గంటిని. విరాళిచే వాడి వత్తియయ్యును సాయోపాసనలు చేతస్సమాధితో యథావిధి ఒనర్చి కృతాహారాభినయుం డై శయనం బొల్లక యీయుపవనికే యేతెంచుచున్నాఁడు. తటి వేచి కొనిపోయెదఁగాక. ఈ విరాళి నా ప్రాణసఖికొఱకే యగును. [వదలం గాంచి] ఆహా! యీ చంద్రుఁ డింత రమణీయుఁ డయ్యును ఏఁచును కదా!

అనిరుద్ధుఁడు విరహకృశుఁడు ప్రవేశించును.

అని.—[నిట్టూర్పు పుచ్చి] హా! ఈవెన్నెలకు చలువగుణము వెండియు నెన్నఁటికిఁ గలుగునో! అహహా!

(ఔపచ్ఛందసికము.)

విరహార్తుల ద్వేషి యై దహించున్,
విరహాతీతుల నెయ్యుఁ డై భజించున్.
'పరికింతు రవస్థ' నన్న సూక్తిన్
బరమార్థంబుగఁ బద్మవైరి సేయున్. ౫౩

చిత్ర.—ఓహో! సత్యము సత్యము.

అని.—ఓయి చంద్రుఁడా, నీపగకుఁ గారణము తెలిసినది!

మ. నిరతజ్యోత్స్న మటంచుఁ దద్వదనమున్ నే మెచ్చుటం జేసి కా
యరవిందాహిత నన్నుఁ జూఁడెదవు నీహస్తాగ్రదీపార్చులన్;

---

౫౩ ప.—ఈచంద్రుఁడు విరహపీడితులను శత్రువై కాల్చును. విరహము దాఁటినవారిని మిత్త్రుఁడై సేవించును. 'లోకులు మనుష్యుని వానియవస్థకు తగినట్లు మాతురు,' అనఁగా, 'బలవంతునికి మ్రొక్కుదురు, దుర్బలుని కొట్టుదురు;' -అన్న సుద్ది వాస్తవమని ఈచంద్రుఁడు తననడవడిచేత నిరూపించుచున్నాఁడు.

౫౪ ప.—సదా వెన్నెల గలయట్టి దని ఆప్రాణేశ్వరిముఖమును నేను మెచ్చినందునఁ గదా ఓకమలవైరీ, నన్ను నీచేతికొన నున్న దివ్వెజ్వాలలతో (నీకిరణముల తుదల

శరముల్ సూదులు బాఁకు లీఁటెలు కశల్ సారింతు నాపైఁ; నహో!
ధరలోనన్ నిజ మాడ నిష్ఠురము కాదా! సామెతల్ దప్పునే. ౫౭

చిత్ర.—'నిరతజ్యోత్స్న మటంచు మషావదనముల్' అనఁడాయె నే!

అని.—ఓయి కళంకీ,

శా. చోక్కంపుంగలశాబ్ధిపట్టి కెటు వచ్చెన్ మచ్చ! నీగుట్టు నే
వక్కాణించెద:—నంశునాళకము నావక్షంబునన్ నాటి, నీ
వక్కాంతాస్యము దోఁచమిన్ రగులు నా స్వాంతంబు గంజాయిగా
హుక్కా గ్రోలుపొగ ల్గ్రాగం బలమె నం;చోతుర్కమాన్యాలుపా. ౫౮

చిత్ర.—ఆహా! ఎంతసరసోపాలంభము!

అని.—అయ్యో, ఓషధీశ్వరా, నీవు ముగ్ధుఁడవో క్రూరుఁడవో.

మ. సతమున్ రోహిణిఁ గూడ లేనివనటన్ జాఁజిక్కినీవే యిటుల్
వ్రతమో నాఁగ వియోగిపాళిపయి నావాల్ సూటి వింతౌ శశీ!

---

జ్వాలంతో) కాల్చుచున్నావు; నామీఁద బాణములు...కొరడాలు ప్రయోగించుచున్నావు. అయ్యో! భూలోకములో నిజ మాడిన నిష్ఠుర మన్న సామెత తప్పదాయె, గదా.—చంద్రునికి రాత్రియేగాని పగట వెన్నెల లేదు, ఉషావదనమునకు వెన్నెల రేలం బవళులం గలదు, కావున అనిరుద్ధుఁడు చంద్రునికన్న ఉషావదనమే ఉత్కృష్టమని మెచ్చినాఁడు...విరహబాధలో చంద్రుఁడు సేయు నుద్దీపనమును అనిరుద్ధుఁడు సహింపకున్నాఁడని భా.

౫౮ ప.—పరిశుద్ధుఁడైన క్షీరసాగరుని కుమారునికి నీకు ఈకళంకము ఎట్లు వచ్చినది? (ఇది నీపుట్టువులో వచ్చినది కా దని భా.) నీ రహస్యమును నేను చెప్పెదను విను. నీవు తురకలదేవుఁడవు కావున వారివలెనే హుక్కా త్రాగెదవు. నీవు నీకిరణ మనెడుహుక్కాగొట్టమును నాహృదయములో గ్రుచ్చి, ఆ ప్రాణేశ్వరి వదనము నా కగపడ సందుకై రగులుకొనుచున్న నా హృదయకమలమే గంజాయిగా హుక్కా త్రాగుచు పొగను వెలిఁబుచ్చుచున్నావు; ఆపొగ ని న్నావరించినది, అదియే నీమచ్చ.

ఉపాలంభము=నింద. ఓషధీశ్వరా=ఔషధపు మొలకల దొరా. ముగ్ధుఁడవో=తెలియనివాఁడవో.

౫౯ ప.—అన్ని తిథులయందును నీ ప్రియతమ యైన రోహిణితోనే కూడియుండమిచేఁ గలిగిన దుఃఖముచేత చచ్చునట్లుగా కృశించుచున్న నీవే వియోగులను బాధిం

మతమో నీకును నోషధీశుఁడ భిషజ్వర్యాదగా సృష్టిలో
నితరప్రాణులగాయ మవ్యథము నీదే దుర్వ్యథాఖ్యంబుఁ గాఁ.

[గాలి సోఁకినందులకు ఒడలు జలదరించుట నభినయించి] ఓయి మలయానిలా, ఏల నన్ని ట్లేఁచెదవయ్యా?

ఆ. చలువ తెమ్మెర యను పలుకు దబ్బఱ సూవె;
దక్షిణుండ వనెడుతత్త్వ మిదిగొ;
విరహి జనుల జీవ వితతి నువ్వెత్తుగా
నూఁదివైచు జముని యూర్పు పీన్ప. ౫౭

చిత్ర.—అయ్యో! సుకుమారుఁడు ఎంత గాసిలుచున్నాఁడు!

అని.—రహస్యము దాఁచుట యనునీపుటపాకమున నెంతకాలము వేఁగుదును? బిగఁబట్టిన యూపిరిని సడలించుట గదా రహస్యము చెప్పికొనుట? వయస్యుఁ డేనియు అగపడఁడుగదా?

చిత్ర.—అయ్యో! కుమారమహారాజు మహావిరహతాపమునం బొగులుచున్నాఁడు! [నటియొకదెస నిర్వర్ణించి] ఈతఁ డెవరో విప్రకుమారుఁడు ఇతనిమిత్రమువలె నున్నాఁడు. ఇతనిం గడుం గూర్మితో వెదకి వెదకి కనిపట్టి హర్షపరవశుఁ డై పరుగున వచ్చుచున్నాఁడు.

విదూషకుఁడు ప్రవేశించును.

అని.—[చూచి] ఆహా! నారాయణా, మూర్ఛందుము మూర్ఛందుము.

విదూ.—వయస్యా, నీ వేమి యీపొంటిపాటును పెళ్లాడినావా? ఈమె కోసం మమ్మల్ని వదిలేసినావే?

అని.—దుఃఖితుఁడు మంచిసహవాసము గాఁ డని మిమ్ముం గూడ నైతిని.

చుట్టుకై దీక్ష వహించితి వేమో యనునట్లుగా వారిని హింసించుచున్నావు! ఇది వింతగా నున్నది. లోకములో ఓషధులను వినియోగించువాఁ డగు వైద్యుఁడు తనవ్రణంపుఁ గోఁతయే సహింపరాని నొప్పి గాని ఇతరులవ్రణముం గోసిన నొప్పి యేమియు లే దని తలంచినట్లు నీవును ఓషధులకు దొరవు గాన వారివలెనే అభిప్రాయపడి యున్నావా?

౫౭ ప.—తెమ్మెర=గాలి; దక్షిణుండు=దయగలవాఁడు (దక్షిణదిక్కు-వాఁడు)—నీ దక్షిణత్వము దయాగమందు లేదు; వితతిఁ=సమూహమును; ఉవ్వెత్తుగాఁ=క్షణములో; జముని=(దక్షిణదిక్పతియైన) యమధర్మరాజుయొక్క-ఊర్పు=శ్వాసమవు.

విదూ.—దుఃఖితుడికి దుఃఖితుడు మంచిసావాసమే గదా.

అని.—కానీ ;

విదూ.—అటయితే మనసహవాసం మంచిదే.

అని.—ఎట్లు?

విదూ.—నిన్ను చీమ కుట్టిందో దోమ కుట్టిందో ఆదుఃఖం నీకు, నిన్ను చూడని దుఃఖం నాకు.

అని.—నన్ను చీమయుఁ దోమయు గుట్టినవా ?

విదూ.—మఱి నీకు దుఃఖ మేమి? పడకలో నల్లి కుట్టిందా ? తలకాయలో యెవతెదైనా పే నేమైనా కుట్టిందా ?

అని.—ఛీ ! మూర్ఖా !

విదూ.—అవును, మ రేమి దుఃఖకారణం ?

అని.—ఏల యడిగెదవు వయస్యా !

విదూ.[ఆటోపముతో] చెప్పకపోతివా జంధ్యాలు వురి పోసుకొని నీకు బ్రమ్మహత్య కడతా.

అని.—అంతపని చేయకు. నీపరాక్రమము నే నెఱుఁగుదును. చెప్పెదను.

విదూ.—చెప్పు మరి.

అని.—మదనసర్పము కఱచినది, విషగ మెక్కినది.

విదూ.—మదన మంటే నాకు తెలియదు. ఏజాతో మనపేళ్లతో చెప్పు, మంత్రం వేస్తా.

అని.—వయస్యా, నే నొకనాఁడు కలలో నొకజగన్మోహినిని వరించితిని.

విదూ.—[పకపక నవ్వి] ఆవేళ వుండ వేసుకొన్నావా యేమి !

చిత్ర.—ఈయనకును కలలోనే గాంధర్వము ! అహో ! సంవిధానము !

అని.—[విదూషకునిచేయి పట్టుకొని] కుదురుగా వినియెదవా లేదా?

విదూ.—అయ్యో, అయ్యయ్యో, అమ్మ కొక్కొక్కో, అబ్రంహణ్యాం అబ్రంహణ్యం ! నన్ను బ్రమ్మహత్య కట్టొద్దన్నావే, నీవే అరంభించావేమి మహరాజా !

అని.—[చేయి వదలి]. కలలో వరించి మేల్కొని కానక యీయవస్థకు వచ్చినాఁడను.

విదూ.—(పకపక నవ్వి) వొకనాడు నేను మంథానభైరవం మింగి సొమ్మసిల్లి

---

మంథానభైరవము=ఎంత భక్షించినను చాలనట్లుగా చేయునట్టి యొకమందు. పేపాహారిపిల్ల యనఁగా ప్రేఁపబెత్తము, దానిని పెండ్లి చేయుట యనఁగా దానితో కొట్టుట.

కలలో మిఠాయికొండ వొకటి నే నొక్కణ్ణే తిని, మునపటికంటే ఎక్కువ ఆకలితో మేలుకొన్నాను. అప్పట్నుంచి పదిహేనురోజులు ఆకొండే కావాలని ఇంట్లోవాళ్లని యేడిపించాను. పదహారోనాడు పెదనాయన నాతో చెప్పకుండా జుట్టు పట్టుకొని పేసావారిపిల్లని నాకు పెళ్లిచేశాడు. ఆమహోత్సవంలో మిఠాయికొండని మరచిపోయి స్వస్థపడ్డాను. నీవున్నూ నా దారికే వొస్తూ వున్నావు. ఎటయినా నావయస్యుడివే గదా.

అని.—తిన్నగా వినియెదవా లేదా?

విదూ.—వున్నమాట చెప్తావా లేదా? కలంటేమాత్రం నేను నమ్మను. కల కోసం వొకడు నీలాగ యేడుస్తూ వుంటాడా? పాడుకలో స్త్రీ కన్పిస్తే అప్పుడు రవంత శేపు యేడుస్తాడు.

అని.—సత్యము వచిస్యా, నామాట.

విదూ.—అలాగైతే అదేదో పిశాచం. కామినీ మోహినీ శాకినీ ఢాకినీ బడబాకినీ దయ్యాలలో ఒకటి. ఆకథ వింటే నన్నుకూడా ఢాకిని వెంబడిస్తుంది.

అని.—మిత్త్రునివిూఁదియాఁగను కత్తితోఁ గొట్టుక్రోఁతివి నీవు.

విదూ.—[మొగము చిట్లించుకొని] నీవో, వెతుక్కొని వొచ్చినందుకు వేళ్లు నలిపి బ్రహ్మహత్య చేశే రాజాధిరాజవు. [మందహాసముతో] పోనీగాని, అలాగైతే, తూచా తప్పకుండా ఆమెస్వరూపాన్ని వర్ణించు, నాకు నాటొస్తుందేమో చూస్తా. నిజమైతే ఆనక నేను వూడకపోతానా?

అని.—మంచిది, నా కిష్టమైనపనియే; వినుము.

విదూ.—సిద్ధము. అందుకే చెవులు చికిలీచేసుకొంచున్నాను. [అని చెవులు దీఁటుకొనుచు] ఇందుకు బదులు పేసావారిపిల్లని నేనూ వర్ణిస్తాను. అది నువ్వు వినక పోతే యిది నేనూ వినను.

అని.—

ఆ. చిమ్మచీఁకటులను జిమ్మి పన ల్సేయు
మోహనాంగి ముద్దు మొలక నగవు;
రమణిమోముమ్రోల రాకామృగాంకుండు
కాముఁ డెత్తు దృష్టిఘటము సూవె. గిర.

---

గిర ప.—రాత్రి ఆ మోహనాంగియొక్క ముద్దులేఁతనవ్వుచేత గాఢాంధకారముం బాసి పట్టపగటివలె వెలుంగును; నిండుపున్నమచంద్రుఁడు ఆమె ముఖమునకు దృష్టి తగులకుండుటకై మన్మథుఁడు నిలిపిన దృష్టిపిడత సుమా.

విదూ.—ఇదేమో అపూర్వమే. మరి మాపేపావారిపిల్లకి కుక్కతల, పూసకళ్లు, ఎంతస్వారస్యంగా చెక్కివున్నవి! వయస్యా, అటుపైన?

అని.—వయస్యా,

ఆ. సాజవేళ లేతజాజొంది చుట్టురాఁ,
దలను చగలినీడఁ దాల్చి సూత,
జంట నొప్పు దొడ్డ జమ్మటి బుగ్గలా
కొమ్మ గబ్బి గుబ్బ కోరకములు! ౫౯.

విదూ.—బళిబళి! మాపేపావారిపిల్లకి [అనిరుద్ధుఁడు విదూషకునికిం దెలియనీక చెవులు మూసికొనును.] అవి లేవు. మెడలో రెండుపట్టుకుచ్చులుమాత్రం వేలాడుతున్నవి, వయస్యా, ఇంతేనా?

అని.—విను వయస్యా,

ఉ. చందున కాత్మబింబసదృశంబుగ గుండ్రకనల్ జనించి యా
పిందెలు చుక్కగా నడుమ బింబములన్ జిలుమచ్చ దాల్చి పైఁ
బొందుగ జాభరారసము మూర్తుల లేతగ నద్దికొన్న నా
సుందరిగబ్బిగుబ్బకవసోయగ మొందెడి నేమొ మిత్రమా. ౬౦.

విదూ.—ఆపిల్లమూలంగా కవీశ్వరుడివై పోతున్నావేమి వయస్యా! చెడిపోతావు సుమా! పోనీ ఆమెబాహువు లెటువంటివయ్యా?

---

౫౯ ప.—ఆకోమలియొక్క మొగ్గలవంటి నిండు గుబ్బలు—సంధ్యాకాలమందు తమచుట్టును లేతగా ఎఱుపుం బొంది, కొనతలయందు ఆకాశపు నీలిమయొక్క ప్రతిబింబము కొంచెము కలవై, జంబూనదిలో జంటగా నొప్పుచున్న పెద్ద బుడగలా ఏమి?

౬౦ ప.—చంద్రునికి తనబింబమునకు పోలికగా ఇరువురు కవల పిల్లలు పుట్టి, లేతపిందెలవంటి యాకవలు దేహమధ్యమందు చిన్నమచ్చను గుండ్ర మయిన చుక్కగా ధరించి, పైఁగా చక్కఁగా జాభరాద్రవమును లేతగా తమమూర్తులకు అద్దుకొన్నయెడల అప్పటికి ఆకవలు ఆసుందరియొక్క నిండు పాలిండ్ల సౌభాగ్యమును పొందు నేమో.

అని.—

క. తాఁకియుఁ దాఁకనిమాత్రన
యేకపదమ వింతమోహ మిడుమరుని ప్రసూ
నాకలితపాశ రాజము
లాకోమలిబాహువల్లు, లలవియె చెప్పన్! ౬౧.

విదూ.—అదేదో పిశాచ మని నేను మొదటనే చెప్ప లేదా. మాపేపావారి పిల్లమాత్రం [అనిరుద్ధుఁడు మునుపటివలెనే చెవులు మూసికొనును.] మదనపాశంలాగ లేదుగాని యమపాశంలాగ వుండినది. మొత్తానికి పోలిక వుంది. బళిబళి! కనకనే నీకింత వెఱ్ఱిపట్టింది. ఇంకా? ఆబొబ్బట్లమడతలను వర్ణించవయ్యా.

అని.—వినుము మిత్త్రమా;

చ. హృదయజుఁ డాత్మకామినికి నీఁతలు నేర్పుటకున్, దదర్థ మా
మృదుచరణావతారమున మెచ్చొదవన్, బరువంపుమంత్రి వే
పదిలము సేయు డిగ్గియయు, బంగరుఁదాపలు, నీలిమొహ్కాలు
స్వదపసనంబుఁ గా, దయితనాభియు, ముత్తఱు, లారుఁ, జెన్నగున్.

విదూ.—[అనిరుద్ధునిచేయి పట్టుకొని] బాపురే! బాపురే! వయస్యా మూఁడు ముడతలకే యింతవర్ణనైతే మాపేపావారిపిల్ల వెనకనుంచి కౌగలించుకోగానే నాపీపంతా వళ్లే, అది తగిలినచోటంతా వళ్లే! అందు కెంతవర్ణన కావలెనో?

అని.—ఎంతతెలియనివాఁడవు వయస్యా!

విదూ.—[కనికరముతో] మన్నించు వయస్యా, యిక ఆపిల్లని వర్ణించను.

అని.—అట్టియాచెలువ నేపథ్యము—

---

౬౧ ప.—ఏకపదమ=ఒక్కుమ్మడిగా. మోహము = పరవశత్వము. ఇడు...జములు=కలిగించునట్టివి పుష్పములతో చేసిన మన్మథుని పాశాయుధశ్రేష్ఠములు.

౬౨ ప.—దొరయైన మన్మథుఁడు భార్యయయిన రతీదేవికి ఈఁతలు నేర్పుటకుఁగా యౌవన మనుమంత్రి నిర్మించిన దిగుడుబావివలె పొక్కిలియు, అందులో దిగునప్పుడు మెచ్చుగలిగించుటకై మృదువుగా నుండునదిగా కట్టించిన బంగారపుమెట్లవరుసబలె వళిత్రయంబును, ఆమెట్లవరుసపై పాదములకు ధూళ్యాదిక మంటకయు మృదువుగాను ఉండుటకై దారిగా పఱపించినట్టి నల్లమొహాములుపట్టు రేకుబలె ఆ తరుణీమణి నూఁగారును ఒప్పుచున్నవి. నేపథ్యము=అలంకారము.

(పంచచామరము.)

మృషావలగ్నజల్లుపైఁట మించుసన్నమం చగున్;
ఝుషాక్షిదట్టమున్న సంజజాజులోనికే కగున్.
తృషాకృగోష్ఠిభూషణాళి దిక్కులన్ మెఱుంగు నా;
నుషావతార మంచుఁ గాంత నూహ సేయుదున్ సఖా. ౬౩.

చిత్ర.—ఆహాహా! ఉషావతార మనుకొన్నాఁడు! ఉషయే యని యెఱుంగఁడు!

అని.—అట్టియాజగన్మోహిని

ఆ. అట్లుగానె పుట్టినట్లుగా నగపడు;
నోలి నెదిగె ననుట యొప్ప రాదు;
మార్పుపొందురీతి మదిలోనఁ దోఁపదు;
అసురమాయొ కొమ్మ యమరమాయొ! ౬౪.

చిత్ర.—ఉభయమాయ సుమా.

అని.—అట్టియాముద్దుగుమ్మ నన్నుఁ దేల్చినముహూర్తము నాఁటిస్వప్నములో నెట్టిదో చెప్పవలయునా?

విదూ.—[ఆత్మగతము] వయస్యునిదుఃఖ మేమో వాస్తవంగా మేర మీఱించగా వుంది. అయ్యో పాపము! అట్టికన్య వుండునా? కలలు నిజంగా ఫలించునా! [ప్రకాశము] వయస్యా, వగవకు. నీకు మేలు కలుగుతుంది. వయస్యా, నీకన్నకలచేత ఆమెను నేను తర్వాత యేలాగ ఆనవాలు పట్టగలను?

అని.—ఇదిగో ఈశిల్పముచే నెఱుంగుము.

---

౬౩ ప.—మిథ్యామధ్య (అనఁగా నడుము లేనిది) అయిన యాచెలువయొక్క సన్నని పయ్యెద ప్రకాశమానమయిన సన్ననిమంచుగా నగపడుచున్నది. (తెల్లనిది), ఆమీననయనయొక్క పావడ యన్నదో సంధ్యారాగములోనుండి కత్తిరించిన దనుగా నున్నది (జాజురావన్నెది), ఆసగొల్పునట్టి కెమ్మోవిగలదైన యాతరుణియొక్క నగలవరుస నక్షత్రములు మెఱుపుఁదీఁగలుంగా నున్నది. కావున ఆకాంత రాత్రియొక్క యవతార మని నేను తలంచుచున్నాను.

౬౪ ప.—ఓలిన్ = క్రమముగా. అసురమాయొ = అసురలక్ష్మియొ. అమరమాయొ = దేవలక్ష్మియొ.

[అని చిత్రఫలకము నిచ్చును. విదూష
కుఁడు చూచి ఆశ్చర్యపడును.

చిత్ర.—[నిర్వర్ణించి] ఆహాహా ! నాప్రియసఖియే కన్నులయదుట నగపడు చున్నది ! ఏమి యీశిల్పనైపుణి ! ఏమి నాచెలిభాగ్యము !

ఆ. మణియుఁ దేజు, జందమామయు వెన్నెల,
వేగుతటియు వెల్గు, విరియు వల్పు,
నెట్లొ యట్లు లెసయు నీయిద్దరం గూర్చి
బ్రహ్మ వేదజడతఁ బాసె నిపుడు. ౬౫.

విదూ.—[నిశ్వసించి, ఆత్మగతము] యిటువంటి, సృష్టి వుంటుందా ? [ప్రకాశము] వయస్యా, నాచపలబుద్ధిని మన్నించుమా. మరి యీమెను యథావిధిగా పెళ్లి చేసుకోరాదా ?

అని.—ఎవ్వతెయో తెలియదు, మిత్త్రమా!
విదూ.—అయ్యో! నిజంగా నీవు అపన్నుడవే వయస్యా!
చిత్ర.—ఇరువురయవస్థయు తూఁచినట్లు సమానముగా నున్నది !
అని.—వయస్యా,

మ. ముదితారత్నముమోము గాంచునపు డామోమే గనం జొచ్చితిన్;
మదిరాక్షీద్యుతిఁ జూడఁజొచ్చిన నదే మాద్యద్దశన్ జూచితిన్;
సుదతిన్ బేరుకులంబుఁ దెలియక యున్నయ్యో నాతెల్వి; హా!
యిదిగోఁ బం డిదిగో హుళక్కి యని న న్నేఁచె న్విధాత్రుం డయో.

[దక్షిణ నయనస్పందము సూచించి] వయస్యా, నాకుడికన్ను అదరుచున్నది.
విదూ.—నీ కిప్పుడే మళ్లీ ఆజగన్మోహినితోను కలుగుతుంది. త్వరగా యింటికి వెళ్లి నిద్రపోయి కల గను.

---

౬౫ ప.—తేజు=కాంతి. వేగుతటి=తెల్లవారుువేళ. విరి = పువ్వు. వల్పు= పరిమళము. ఎనయు = సరిపోవునట్లు. వేదజడతన్ = వేదాభ్యాసజడుఁడనునపకీర్తిని.

౬౬ ప.—మదిరాక్షీద్యుతిన్= మాదకములైన కన్నులకాంతిని. మాద్యద్దశన్= మత్తెక్కుచున్నవాఁడనై. సుదతిన్=ఆయువతిని. విధాత్రుండు = బ్రహ్మ.

అని.—అంత పుణ్యమా ? అయినను బ్రాహ్మణవచనమును పరిగ్రహించితిని.
[అని చిత్రఫలకమును వక్షమం దుంచుకొని కన్నులారం గాంచి, యున్మాదంబున]

(దక్షిణాంతిక.)

నవనీత సనాభి మూర్తి వై
పవిధారా పరిభావి గా మదిక్
నవరించితి చామ యేలొకో
వివరంబుక్ వినిపింపుమా దయక్. ౬౭.

విదూ.—ఏమి యిది వయస్యా, వృత్తచిత్తరువేగదా, దీని కంత కింతి మనివి?

అని.—అయ్యో ! చిత్తరువేనా ! హా ప్రాణేశ్వరీ ! [అని మూర్ఛిల్లును.

విదూ.—వయస్యా, వయస్యా, హాహా ! ఏమిచెయ్యవొచ్చును ! అయ్యో చిత్తరువని నే నెందు కన్నాను ! పాపాత్ముడను మృత్యువులాగ నే నెందుకొచ్చాను! [ఆలోచించి] కానీ యీవాకలోనుంచి తామరలు నీళ్లు తెచ్చి తేస్తా.

[అని పరుగునం బోయి తామరలు
కోయుట నభినయించును.

చిత్ర.—ఇదే సమయము. [అని యనిరుద్ధుని ఆకాశవీథికిం గొనిపోవును.

విదూ.—[శీతలోపచారోపకరణములు తెచ్చి] వయస్యా, వయస్యా, [అని కడుంగడు వెదకి] యెక్కడా లేడు. [క్రింద చూచి] యీచిత్తరుపుపలక యిక్కడ్నే వుంది. [అని ఫలకముం బుచ్చుకొని] వయస్యు డేమయినా నేను వేళాకోళంగా అన్న మాటప్రకారం నిద్రపోవడానికి యింటికి వెళ్లాడేమో ! అక్కడికే వెళ్లి విచారిస్తా. అక్కడ లేకపోతే యీచిత్రపుపలకని శ్రీకృష్ణులవారికి వొప్పగించి యీవృత్తాంతం వారికి విన్నపంచేస్తా. [అని పరుగున నిష్క్రమించును.

చిత్ర.—ఈఫలకముచేత ఉషాస్వరూపము శ్రీకృష్ణాదులకు తెలియునగును గాక, నాతిరస్కరిణిచే నితండును విదూషకునికిఁ గానరాఁడయ్యె. నాసమ్మోహినీవిద్యచే నీయన ఉషచేయి తగులువఱకు ఇట్లు మూర్ఛామగ్నుఁడుగా నే యుండును. మహావిద్యా, మందాకినీప్రాసాదమునకుఁ గొనిపొమ్ము. [అని ఆకాశగమన మభినయించి] ఆహా విద్యాప్రభావము !

చ. ఇటియఁగ నుద్ద గీఁచినవహిక్ బురణించెడి రక్కమొత్తముల్,
కటిజలదాళిలో మెఱపు గ్రాలుగతిక్ దివి నేఁ జెలంగెదక్,

---

౬౭ వ.—చామ=ఓ యింతి.

బిఱబిఱ వర్షగోత్రపృథివీధరవర్గముతోడ ధాత్రియుఁ
వఱలు దవిష్ఠ నై తఱిమెనం గవబొంగర ముగ్గురై వడిన్. ౬౮.

ఎట్టి దైవసంవిధాన మిది!

క. పువ్వువింటిసోఁకుబారికి
జవతప్పిన చెలియ కిట్టిసంజీవమణిన్
దివిఁ గేలఁ దెచ్చితే సకు
నెవ రేనియు నెంచునేని యెన్నఁడేనిన్. ౬౯.

ఈయువతిని త్వరగా ఉషకు నిచ్చి కృతార్థ నయ్యెద.

[అని నిష్క్రమించును.

తృతీయాంకము ముగిసినది.

---

౬౮ ప.—నక్షత్రసంఘములు ఒక తిన్నని గీఱప్రక్క మఱియొక తిన్నని గీఱగా సుద్దతో గీఁచినట్లుగా తెల్లని తిన్న గీఱలుగా కనఁబడుచున్నవి. నల్లని మబ్బులో ఈమూల నుండి ఆమూలకు మెఱపుఁదీఁగ మెఱసినట్లు నల్లని యాకాశములో నేను మహావేగమునం బోవుచున్నాను. భూగోళము నాకు అతిదూరమై రెండువైపులను మురికి వేయఁదగిన జంటబొంగరము తరిమెనలో తిరిగినట్లు వర్షపర్వతములతోను కులాచలములతోను గిఱ గిఱం దిరుగుచున్నది.—బొంగరములో త్రాడుచుట్టెడు నడుదలవలె భూగోళముమీఁద పర్వతము లున్నతావు మిట్టగాను లేనితావు లోఁతుగాను ఉన్నవని భా. కడమ సాటిని ఆలోచించుకొన వచ్చును.

౬౯ ప.—పువ్వువింటిసోఁకు బారికిన్=పూవిలుకాఁ డనెడు పిశాచుని బాధకు. ఇట్టి సంజీవమణిన్=ఈయనిరుద్ధునివంటి జీవనప్రదుని. దివిన్=ఆకాశమార్గమున.

# తురీయాంకము.



స్థలకము 1.—శోణపురి, బాణుని సభామంటపము.

కరేణుక ప్రవేశించును.

కరే.—[ఒకపండ్లపాణకను నిర్దేశించి] యీపళ్లపాణకలో గూరి వుండి నాముద్దులరాయణ్ణి, సభలో యేలాగ కీవిగా వుంటాడో చూస్తూ వుంటాను. నా రాయుడు కూర్చునేయీకుర్చీలో వాళ్లొచ్చేదాకా కూర్చుంటా. ఇదైతే నాకు సరిపోతుంది. నాకర్లంతా నాపక్షమే. నామీద యెవ్వరూ కొండాల్యలు చెప్పరు. [అని పెద్దయాసనమునఁ గూర్చుండి దానిని ముద్దు పెట్టుకొని] ఆయన ముందొస్తే నేను లేవకుండా గర్వంగా వుంటా.

గంభీరవేది ప్రవేశించును.

గంభీ.—యీర్గోజు రెండిట్లో వొకటి సిద్ధాంతం అవుతుంది. యేలాగయినా యీపెళ్లి నాకు తప్పునా యీశ్వరా! [నిర్వర్ణించి] యేమిదీ! నాకుర్చీలో గడ్డిమేటి! [వెండియు నిర్వర్ణించి] కాదు కాదు, కరేణుక! కరేణుకా.

కరే.—[గర్వముగా] అక్కడ కూర్చో.

గంభీ.—మనకి ఒకరొకరికీ సరిపడే ఆసనం యిదొకటే.

కరే.—నువ్వు ముందరొచ్చావేమి?

గంభీ.—నువ్వు ముందరొస్తావనే?

కరే.—ఏపెళ్లి తప్పాలని మొక్కులు మొక్కుతున్నావు?

గంభీ.—వుపకీ నాకూ.

కరే.—నీకూ నాకూ గాదు గదా.

గంభీ.—కాదు.

కరే.—అయితే ఆతలుపేశొచ్చి నన్ను కాగిలించికొని నాకు ముద్దియ్యి.

గంభీ.—[పోయి తలుపువేయుట నభినయించి వచ్చి] రా మరి.

[అని యిరువురును స్థౌల్యంబుచేత చేతులు కడుపు చుట్టు రానందున ఒండొరులం గౌఁగిలింపలేక మాని, ముద్దిడుకొనంబూని కడుపు లడ్డపడుట చేత సాధ్యపడక ఎంతయు యత్నించి భగ్న మనోరథు లగుదురు.

కరే.—యిది మనవ్ల గాకపోతే పోనీ. యిద్దరం చెట్టాపట్టాలు పట్టుకొని నాట్యమాడేదాం రా. [ఇద్దఱు ఆడుచు పాడుదురు.

(గేయము)

ఆకలైతే వెళ్లి ఆడాడ తారాడి [మూన...
మానుసులను మింగి మాయం చేతాం, మాయం...మాయం...
మూడియేనుగడ్డొల్ల నొక్కా గొడుక్కొని
మంచు కొండకి వెళ్లి మళ్లీవొత్తాం, మళ్లీ...మళ్లీ...మంచు...
నే మొగ వేసాము నివాడ వేసాము
ఆహిరి విటకారాలారంబింతాం, ఆరం...ఆరం...ఆహిరి...
కల్లు సంద్రాన్కెళ్లి కల్లంతా తాగేశి
ఆరే సంద్రాలని అరిచి వొత్తాం, అరిచి...అరిచి...ఆరే...
మనలోనే యేమైనా మరికిత మొత్తేను
నావేటు లన్నిట్ని నీవేతిను, నీవే...నీవే...నావేటు...

[నేపథ్యమున మహాతూర్యధ్వనులు.]

గంభీ.—[శ్రవణ మభినయించి] అదె! ప్రభువు వస్తున్నాడు. నువ్వు పో.

కరే.—పోతాను. [అని పాణకలో చేరును.

గంభీ.—దీనియిల్లు బంగారం గానూ, యిదేమో యీవేళ కొంప ముంచేలా గుంది. [అని పోయి తలుపు తీయుట నభినయించును.

బాణ ప్లోదన రాష్ట్రి కుంభాండులు ప్రవేశించి
యథోచిత ముపవిష్టు లగుదురు.
యథావిభవము పరివారంబును ప్రవేశించును.

గంభీ.—మామగారికి నమస్కారము. [అని బాణునికి ప్రణమిల్లును.

బాణు.—కల్యాణము. వత్సా, నీశ్రద్ధకు సంతోషము. కూర్చుండు. ప్రేయసీ, నీయత్న మే మయినది? ఉష వివాహమున కంగీకరించినదా? ఇపుడు స్వస్థముగానే గదా యున్నది? వివాహము సేయక పెండ్లియీడువచ్చినపిల్లను ఇంట నుంచుకొని యుండుట యవమానము గదా. పెండ్లిచేత దానికిని మనకును ఎడఁబాపు గలుగకుండ ఈ గంభీరుని కిచ్చి వీనిని ఇల్లంట్రట ముంచుకొన నిశ్చయించితిని గదా. ఇంతకన్న దాని కేమి గావలయును! అంగీకరించిన సంతోషవార్త చెప్పుము ప్రేయసీ.

రాణి.—ప్రాణేశ్వరా, ఏమి సేయుదును! ఎంత బోధించినను, ఎంత బతిమాలినను, ససేమిరా యనుచున్నది. నిర్బంధించిన అది ప్రాణము విడుచును, నిశ్చయము.

బాణు.—[కోపావేశముతో] ఆ! ఆ!

గంభీ.—[ఆత్మగతము] ఈలాగైనా నాకు తప్పనుగాక! [ప్రకాశము] త్రిజగతీనాయకా, ఏల నిర్బంధము? ఉష సుఖముండుఁగాక.

(మదనము)

దూరాన నేనియును గందును గన్నులారన్
నీరేరుహానన యెదన్ నెన రూనదేనిన్;
ధారాధరాళిఁ గని సంతస మొందదో కే
కీ రియ్యకే యుఱిమినన్ శితికంఠ ముర్విన్. ౭౦.

బాణు.—[క్రోధావేశముతో] అంగీకరింపదేని యిఁక నుండదు.

(వనమయూరము)

కానను దనూజ యని, కాఱియల నైతున్,
మాన నిఁక భాసటయు మాధవుఁడె గాక్షీ;
ఈ నిసుఁగు నాయెదకు నీతి యిడ సాగెన్;
ఏనికకుఁ గొండమున నింగిలము సొచ్చెన్. ౭౧.

ముల్లోకముల జేతను పిల్ల సరకుగొనదఁట! మంత్రీ, కంచుకిని రప్పించి ఉషను తెప్పింపుము.

కుంభా.—ఎవరరోయి, అక్కడ? [అని యర్ధోక్తిలోనే పరికించి] దేవా, కంచుకియే వచ్చుచున్నాఁడు. [బాణుఁడు గ్రుడ్లుఱుముచు మీసలు వడివేయును.

౭౦ ప.—నీరేరుహానన = కమలముఖి. నెనరు = కరుణ. ధారాధర ఆళిన్ = మేఘపంక్తిని. శితికంఠము = నెమలి.

౭౧ ప.—తనూజ = కూఁతురు. కాఱియలన్ = బాధలయందు. బాసట = సహాయుఁడు. నిసుఁగు = శిశువు (ఉష). ఎదకున్ = హృదయమునకు. ఈతి = ఈతిబాధవంటి బాధను. ఇంగిలము = ఒక తెగ చేఁప, అది సన్నగా జెట్టివలె నుండును, అది కుట్టినయెడల తేలు కుట్టినట్లు విష మెక్కును.

శలభంబు = మిడుత.

కంచుకి.—[ప్రవేశించి యాత్మగతము] అయ్యో! నేఁటికాలమునకు ఎట్టి పని నాకు సంభవించినది! ఇతరులది తప్పు నాతలకు ముప్పు! నాగతి యీగడియలో నేమి కానున్నదో! నాగతి యేమైన నేమి, ఆ మంగళవిగ్రహము ఉషకా యిట్టికీడు గలుగుట! అయ్యో! ఇందులకా నే నింతకాలము బ్రదికితిని! హా! దైవమా! హా! దైవమా! వీఁడుగో ప్రభువు. ఎట్లు వాకొందును! హా! ప్రళయకాలరుద్రుఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. దావాగ్నిలో శలభంబువోలె పోయిపడెద. ఈతనికోపము నాతో చల్లాఱి ఉషకు అపాయము తప్పును గాక. [సమీపించి ప్రకాశము] జయము జయము జగదీశ్వరునికి! [స్వగతము] ఆచారోక్తి పలికితిని. నోట తడి లేదు. మాట రాదు. [వడ వడ వణఁకుచు] జగదీశ్వరా,

బాణు.—ఏమోయి నీ తబ్బిబ్బు? నీముఖము చూడఁగా ఏమో చావువార్త తెచ్చినవానివలె నున్నావు? నిర్భాగ్యుఁడా!

కంచు.—మేము జాగ్రత్తగానే యుంటిమి! ఆమహేశ్వరునిపాదములాన! ఏలినవారిపాదములాన; అయినను, మఱి, [అని గుటకలు మ్రింగును.

బాణు.—పాపిష్ఠుఁడా, అయినను ఏమిరా? ఏమైనను? [అని కత్తి దూయును.

కంచు.—అమ్మాయి ఉష గర్భిణిగా నున్నది! పురుషుఁ డంతఃపురములోనున్నట్లు తెలియుచున్నది!

బాణు.—ఏమి! ఏమిరా! ఉష గర్భిణి! పురుషుఁ డంతఃపురములో! ద్రోహీ, ఇదా నీమాట! ద్రోహీ, నీవు కూర్చితివఁటరా?

[అని కత్తితో పొడువ నుంకించును. అహ్లాదనుఁడు కత్తిని పట్టుకొని తప్పించును. కంచుకి కృతాంజలియై వినయనమ్రుఁడునై యుండును.

గంభీ.—[ఆత్మగతము] ఇందుచేతనే పెళ్ళి వొల్లనన్నది! ఆహాహా!

బాణు.—ఓహోహోహో! నాయింటనా విటకోలాహలము! ఓరీ ద్రోహులారా! [అని భద్రాసనము డిగ్గనుఱుకును. అందఱు లేతురు.

బాణు.— (స్రగ్ధర)

ఘూర్ణీపాళీకరింతున్ ధుతి హతిఁ బుడమిన్ ధూర్జటిప్రీతి గాఁగన్,
శైలవ్యూహంబులన్ తాజడిగ దెసదెసన్ జల్లెదన్ వేసవేల్గాన్,

౭౨ ప.—ఈభూలోకమును ఇటునటు ఆడించుటచేతను కొట్టుటచేతను నుగ్గునూచము చేసి శివునికి ప్రీతి గలిగించెద.—(ఆయన సంహారము చేయువాఁడు, ఆపని నేనే చేసినచో ఆయన విశ్రాంతి పొందినవాఁడై ఆసేవకు నన్ను మెచ్చుకొనునని భా.) శైల

నా లోలద్భూభృద్వ్యూహంబులన్ రాజడి గొలిపి యజాండవ్రజంబులన్ దెమల్చన్,
వే లంఘాచంగతన్ నిర్విధి యహరిగ నీవిశ్వమున్ గాడ్పోనర్తున్. ౨౨.

ఇదె యిపుడె దానియంతఃపురము సొచ్చి—

[అని పటపట పళ్లుకొఱుకుచు క్రోధావేశ మాపుచుండును.

రాణి.—అయ్యో నాపట్టీ !

అష్ట.—అయ్యో నాసోదరీ మంగళమూర్తీ !

గంభీ.—[ఆత్మగతము] నాతంటా తీరింది. యీగందరగోళంలో నాయదృష్టం మంచిది !

బాణు.—దానిచెలువునిం బట్టి మెడపట్టి యీతీరున నులిమెదను.

[అని గంభీరవేదిని మెడ నులుమును.

గంభీ.—క్రో [అని యేడ్చి] అయ్యో! అయ్యో! అమ్మ కొక్కుణ్ణి! అమ్మ కొక్కుణ్ణి!

బాణు.—దౌర్భాగ్యదూషితుఁడా, నీయవలక్షణముచేత నిట్లు సంభవించినది! పాడుముండకొడుకా!

[అని కొట్టును. గంభీరవేది క్రింద పడి దొరలి తప్పించుకొని పోయి పరిజనము వెనుక నణఁగును. కరేణుక పాణకనుండి దొరలి పెద్దద్వారమునం బాఱిపోవును.

బాణు.—

క. వానిని గ్రద్దల కేసెద,
దాని మహాంభోధిక్రిందితలమున దాఁతున్,
వే నాతో రండు సారం
గానన్ దద్గేహమునకుఁ, గట్టుఁడు వానిన్. ౨3.

——(*)——

వ్యూహంబులన్ = కొండల సమూహములను. రాజడి=శిలావర్షము. లోలత్ =చలించుచున్న. అజాండవ్రజంబులన్ = బ్రహ్మాండ సమూహములను. లంఘాచంగతన్=దాటుటయందలి నేర్పుతో. నిర్విధి=బ్రహ్మలేనిదిగాను. అహరి = విష్ణువు లేనిది గాను. విశ్వమున్=లోకమును.

౨3 ప.—అంభోధి=సముద్రము. తద్గేహమునకున్=దానియింటికి.

స్థలకము II.—మందాకినీ ప్రాసాదము.

ఉషానిరుద్ధులు సంగీతగోష్ఠిగా ప్రవేశింతురు.

[ఆహ్లాదనాచులు స్తంభములందు లీనులై యుందురు.
బాణుడు నేలతలుపును ఎత్తి అచ్చట తలసూపును.

ఉష.—ఆర్యపుత్రా, ప్రేయసిని కాంతుఁడెట్లు చూచుకొనవలయునో దానిని నీదివ్యగానమునం బాడుము.

బాణు.—[ఆత్మగతము, కోపముతో] 'ఆర్యపుత్రా!' 'ఆర్యపుత్రా!' [ఇంచుక శాంతితో] అయినను వీఁడెవఁడో మహాపురుషుఁడే.

రాణి.—[నిర్వర్ణించి] ఆహా! ఇట్టియల్లుఁడు దొరకుట మహాభాగ్యము గాదా!

ఆహ్లా.—ఏమి నాచెల్లెలిపుణ్యము! ఏమి మాపుణ్యము!

అని.—ప్రేయసీ, కాంతంగూర్చి కాంతుఁ డిట్లు నడచుకొనవలయును.

(మధురకాక్కుర.)

ప్రియసఖిరీబోలె, శిష్యఁగా, గృహదీపకళికఁగాను,
దయ దొలంక వివిధ భోగ దాత్రి కల్పలతఁగాను,
అయము గా నవనవరక్తి నర్ధాంగలక్ష్మి నెప్డుఁ
బ్రియుఁ డఖిలజన్మసతిఁ గన్న, వే త్రింద్రభోగ మేలా! 28.

ఉష.—మహాప్రసాదము.

అని.—సతీ, ప్రియునియెడల ప్రేయసి యెటుండవలయునో నీముద్దువాక్కుల నావీనులకు విందొనర్పుము.

ఉష.—ఆర్యపుత్రా, నా నసుఁబ్రాయిపల్కులను మన్నింపవలయు.

(మధ్యాక్కుర.)

కాంతునిం దన మేటిదేవుఁగా గురుంగా దొరంగాఁగ
సంతసంబె మొగానఁ దోఁప సంతానపాదపంబుగను
స్వాంతముఁ జేతలుం దాను నతనికై తనకుఁగాఁ గాక
కాంత రెండిండ్లకుం గీర్తి కలుగునోజను గొల్వవలయు. 29.

---

28 ప.—దాత్రి=ఇచ్చునట్టి. అయము = శుభము. అర్ధాంగలక్ష్మిగ—భార్య పురుషుని దేహార్ధ మని శాస్త్రము.

29 ప.—సంతానపాదపం=కల్ప వృక్షము – సకలము నిచ్చువాఁడు అనుట. స్వాంతము=మనస్సు. ఓజ=విధమున

అని.—ఆహాహా ! ప్రియా, నీమృదువాణి వినవినం దృష్ణ హెచ్చుచున్నది !

రాణి.—[ఆత్మగతము] వాకుఁ గీర్తి తెచ్చితివి నాకూనా.

బాణు.—[పైకి దుమికి ఆత్మగతము] వీనిం జూడ నా మొదటికోపము మొక్క-వోయినది. అయినను అనాసురవృత్తమును నేనొల్లను. [ప్రకాశము] ఓరీ, పట్టుఁడు వీనిని. [బాణపరివారము అనిరుద్ధుని చుట్టుకొనును.

బాణు.—ఎవఁడవురా నీవు ?

అని.—[లేచి] నీయల్లుఁడను మామా. [అని కత్తి దూయును.

బాణు.—ఛీ ! చోరా ! అల్లుఁడవా మల్లుఁడవా !

[అని అనిరుద్ధుని కత్తితో వేయఁబోవును.

ఆహ్లా.—[ఆకత్తి పట్టుకొని] నాయనా, ఇట్టియల్లుఁడు నీకు సులభుఁడా ? మహాపురుషుని సత్కరింపుము. [అని యడ్డపడును.

రాణి.—ఆర్యపుత్రా, ఉషను రక్షింపుము.

బాణు.—[రాణిని] ఛీ ! దుర్జాతా ! [అని, కుమారుని గోడకు విసరి] రారా దొంగా. [అని అనిరుద్ధుని చీరును.

కుంభా.—[ఆత్మగతము] హా ! ఈమాఱు నారాయణుఁడు ఈదివ్యమంగళరూపమున నసురనాశార్థ మవతరించినాఁడు. కాన, జగడాన చావు, రాజాజ్ఞ.

[అని అనిరుద్ధుని చుట్టవేసికొనును.
గంభీరవేదియు నట్లు చేయును.

ఉష.—ఆర్యపుత్రా, నిన్నుఁ గాచుకొమ్ము, మానాయనం గావుము.

అని.—ప్రేయసీ, భయపడకు.

[అని యాయుధము పాఱవైచి, కుంభాండుని
త్రోసి, గంభీరవేదిని కడుపుపైఁ దన్నును.
ఇరువురును మూల కొకఁడు ఒఱగుదురు.

కుంభా.—[కడుపు పట్టుకొని నొప్పి సూచించుచు, ఆత్మగతము]

క. నీలోత్పలకోమల మీ
బాలునిమే నేదొ యొక్క బ్రహ్మాస్త్రమురా !

గంభీ.—[కడుపు పట్టుకొని యేడ్చుచు]

---

౨౬ ప.—ఈబాలుని దేహము నల్లగలువవలె మృదు వయినను వీని దెబ్బమాత్రము బ్రహ్మాస్త్రమువలె అప్రతిహతముగా తగులుచున్నది. పెద్దనల్లకొండను చిన్నవజ్రాయుధము

# విజ్ఞాపనము.

---

ప్రౌఢజనైకవేద్యరసం బగు ప్రతాపరుద్రీయనాటకము వలెఁ గాక కోమలమతిసుగమం బగు దృశ్యప్రబంధం బొకటి అర్ధయామ మాత్ర ప్రయోజనీయము సృష్టించి యియ్యుమని, నన్ను, విక్రమసింహపుర్యాంధ్ర భాషాభిమానిసమాజమువారును మదరాసు విద్వన్మనోరంజనీసమాజము వారును కోరఁగా, వారి ప్రణయము నుపేక్షింపఁజాలక, నాకుం బ్రతిభయు శక్తియు లేమికి ననుగుణంబుగా, ఈ చిన్నిరూపకమును రచియించినాఁడను. గుణదోషనిర్ణయమునకు నిర్మలహృదయు లగు విద్వాంసులు ప్రమాణము.

వేదము - వేంకటరాయశాస్త్రి.

తే. 1, మే, 1901.

శ్రీ

ఈ నాటకమును

వీణాగానకళానారదులును

సాంగవేదములం దధీతులును సర్వదర్శనములందు నదీష్ణులును

సంస్కృత ప్రాకృ తాంధ్ర ద్రావిడ కర్ణాట మహారాష్ట్రాంగ్లేయ గ్రీక లాటి

నాద్యష్టాదశ భాషా లక్ష్యలక్షణాభిజ్ఞ సార్వభౌములును,

ద్రావిడభాషా ఫైలాలజీ దర్శన ప్రథమ ప్రవర్తకులును,

మదరాస్ ప్రెసిడెన్సీకాలేజి ఫైలాలజీ ప్రాక్తన భాషా మహోపాధ్యాయులును,

బోధిసత్త్వకల్పులును

అగు

నస్మన్మిత్త్రరత్నంబు

తాతవల్లి మిరాదార్

శ్రీయుత శేషగిరిశాస్త్రులు ఎమ్. ఏ. గారి

కీర్తిమూర్తికి

సమర్పించినాఁడను.

వే. వేం.



నీలాద్రి నల్ప మా దం
భోళికరణి వీనితన్ను ద్రుంచ్చిలె నన్నున్ ! ౭౯.

జన్మజన్మమునను నాకు ఉష అక్కఅలేదురా బాబూ !

[బాణుఁడు నాగపాశముతో అనిరుద్ధునిం గట్టి వేయును. అనిరుద్ధుఁడు నిశ్చేష్టుఁడై పడును.

గంభీ.—ఏమి మహాప్రభువుమహిమ !

కుంభా.—మేఘనాదుని బ్రహ్మాస్త్రమునకు ఆంజనేయులువలె ఇతఁ డేమో కారణ విశేషముచే ఈసర్పాస్త్రమునకుఁ గట్టుబడినాఁడు. కావున మనలను నొంపవచ్చువాఁడు మఱియొకఁడు కలఁడు.

బాణు.—[కుంభాండుని, గంభీరుని లేపి] ఓరి నిర్భాగ్యులారా, వీనిం జెఱకుం గొనిపొండు. వీనికి చండికాద్వీపములో అంధకారప్రాసాదము కారాగృహము. గంభీరా, ప్రకృతము నీవు కావలి.

గంభీ.—[నొప్పికి డొక్కపట్టుకొని] మహాప్రసాదము.

బాణు.—మంత్రీ, ఈపిల్లకు భ్రాంతిద్వీపమున నక్షత్రప్రాసాదము కారాగృహము. [అని నిష్క్రమించును.

[కుంభాండగంభీరాదులు అనిరుద్ధుంగొని నిష్క్రమింతురు.

ఉష.—హా ! ఆర్యపుత్రా ! [అని మూర్ఛిల్లును.

రాణి.—అయ్యో, నాపట్టీ ఆశ్వసిల్లుము, ఆశ్వసిల్లుము. [ఉష ఆశ్వసిల్లును.

రాణి.—రా అమ్మా, బయలిగాలి ప్రాణ మిచ్చును.

[అని ఉషం దోడ్కొని నిష్క్రమించును.

ఆహ్లా.—అహా ! ఏమి యాశ్చర్యము !

ఉ. నా యనుజాత యేమి ! కుహనావిధి మ ప్పిటు కన్నెఱాగి తా
నీ యసహాయశూరుని రతీశసమానునిఁ గూడు టేమి ! యే
మో యిది దేవకైతవముఁ బోలెడు; మా కిట లగ్గొ యెగ్గొ ! హా !
నాయన చండదర్ప పరిణద్ధ రణోద్ధతుఁ డేమి సేయుదున్ ! ౭౭.

---

ధము కూల్చినట్లు చిన్నవాఁడయిన వీని తన్ను నన్ను నొంగిలించినది (నాశముచేసినది).

కారాగృహము=చెఱసాల.

౭౭ ప.—అనుజాత=చెల్లెలు. కుహనావిధిన్ = కపటోపాయముచేత. రతీశ=మన్మథ. దేవకైతవము = దేవతల మాయ. లగ్గొ=మేలో. ఎగ్గొ = కీడో. చండ... తుఁడు = తీవ్ర గర్వముతో కూడుకొన్న యుద్ధమునందు విజృంభించువాఁడు.

క. నళినియు నభోమణియు న
ర్గళిలి నెండోరఁ గూడిమాడి మెయిమెయి నుండన్
ఫెళఫెళ నుఱుముచు మెఱుయుచుఁ
బ్రళయఘనాఘనుఁడు వచ్చి ప్రళయం బొసఁగెన్. ౭౮.

నేను పోయి శివదర్శనము చేసికొని మంగళావహానము వేఁడుకొనియెదను.

[అని నిష్క్రమించును.

తురీయాంకము ముగిసినది.

---

౭౮ ప.—నళిని=తామరతీఁగ. నభోమణి=సూర్యుఁడు. కూడి మాడి=కలసి మెలసి. మెయి మెయిన్=అనుపద్రవము గా. ఘనాఘనుఁడు= వర్షించుచున్న మేఘుఁడు. కూడి మాడి = కలసి మెలసి.—నిరుపద్రవమున నున్న యుషానిరుద్ధులకు బాణుఁడు చెఱుపు చేసె నని పద్య భా.

# పంచమాంకము.

స్థలకము I.—భ్రాంతిద్వీపము నక్షత్రప్రాసాదము.

ఉష ప్రవేశించును.

ఉష.—ఎవ్వరును దృష్టిపథమున లేరు. అందఱను కనుమొఱంగి వచ్చితిని. [క్రిందికి తొంగిచూచి] క్రిందిభూమి యగపడుటయే లేదు. చిత్రలేఖకుంగూడ అక్కఱలేనియీదుఃఖజన్మమును ఇక్కడినుండి పడి సమాప్తి నొందించెద.

క. గౌరీ! నీ కిదె నాకడ
సాష్టప్రణామంబు, వర మొసంగుము తల్లీ,
వారక ప్రతిజనిని నా కతఁ
డే రమణుఁడు గాఁగ చిత్రయే సఖి గాఁగన్. ౭౯.

[అని దుముకును.

చిత్రలేఖ ఆకాశయానమునఁ బ్రవేశించును.

చిత్ర.—

క. చూడవు పతిఁ, జూడవు సఖిఁ,
జూడవు గర్భస్థ మైనసుందరమూర్తిన్;
మోడిగఁ బ్రాణసఖీ, యీ
పాడువిధిమతంబె సిద్ధపఱిచెద వేమే! ౮౦.

[అనుచు మధ్యనిలువులో పట్టుకొని మేడమీఁదికి తెచ్చియుంచి సేదదేర్చుచు] ఆశ్వసిల్లుము సఖీ, ఆశ్వసిల్లుము.

ఉష.—[కన్ను దెఱచి, ఆత్మగతము] నే నెచట నున్నాను. ఉషను గదా. మందభాగ్యను గదా. మృతికై గదా పడితిని. ఇ దేమి జన్మాంతరమా? ఇది యే

---

౭౯ ప.—వారక=తప్పక. ప్రతి జనిన్=ఎల్ల జన్మములందును.

౮౦ ప.—మోడిగన్=పంతముగా. విధి=నియతియొక్క.

ఆశ్వసిల్లుము=ఊఱడిల్లుము. హర్మ్య పృష్ఠము=మేడపై తలము.

8

లోకము? [చిత్రరేఖం జూచి] ఈదేవత యెవరు? చిత్రరేఖగా నున్నది! [కలయం గని] అదే యీహార్మ్యపృష్ఠము. ఈమె నన్నుఁ గాచినది. [ప్రకాశముగ] చిత్రరేఖా,

చిత్ర.—ఉషా, ఏమి యిట్లు చేసితివి?

ఉష.—నన్నేల కాచితివి?

చిత్ర.—ఓసి గోలా,

క. పతి యేమి తప్పు చేసెన్ ?
సుతుఁ డీగర్భస్థుఁ డేమి సొం పొనరించెన్ ?
వెత నేమి నేను గుడిసితి ?
మృతి నొక్కట మూకు ముప్పుర కిపుటకుఁ జెపియా? ౮౧.

ఉష.—నే నేల బ్రదుకవలయును సఖీ ?

చిత్ర.—ఏల యట్లు పల్కెదవు ?

ఉష.—సఖీ,

సీ. ఒడిలోన నేను లే కోలగం బుండని । తండ్రికి నేఁ బగదాన నైతి,
నన్నుఁ గైసేయించి కన్నదే దినమైన । తల్లికి నే విషవల్లి నైతి,
ప్రాణంపుఁబ్రాణంబు పగిది నన్నోమెడు । నన్న కేఁ దలవంపువ్యాధి నైతి,
నను గోరి తనప్రాణమునకుఁ దెగించిన । దయితుని కే బంధదాత్రి నైతి,
తే. ప్రాణనాథుని నేఁ గొల్చి బంది నైతి,
తప్పు లేక కుశీలపతాక నైతి,
డెప్పరము మాని సకి నీవ చెప్పవమ్మ
మాన మేఁదినవెలఁదికిఁ బ్రాణ మేల ? [అని యేడ్చును.

చిత్ర.—[కన్నీళ్లు తుడుచుచు] ఏడువకు చెలీ, ఏడువకు; సతీమతల్లికి నీ కేటి కొఱంత ! నాజతనము గొఱవేటియుండిన మీ కీయిడుమలు వచ్చియుండవు.

[ఉష యేడ్పు మాని నిట్టూర్పు పుచ్చును.

---

౮౧ ప.—ఓలగంబు ఉండని = కొలువు తీరని. కైసేయించి = అలంకరింపించి. వల్లికన్ = తీఁగను. పగిదిన్ = వలె. ఓమెడు = రక్షించెడు. దయితునికిన్ = ప్రాణనాథునికి. బంధదాత్రిన్ = చెఱ గలిగించినదానను. బందిన్ = ఖయిదిని. కుశీలపతాకన్ = చెడునడతకు జెండాను. ఏదిన = పోయిన.

అస్పృశ్య కరణి = ఒరుల కగపడకుండుటకు సాధనమైన విద్య.

చిత్ర.—[ఉషాహృదయముం దాఁకి] సఖీ, నీగుండియ లింకను అదరుచున్నవి. సమాశ్వసిల్లుము, సమాశ్వసిల్లుము.

ఉష.—ఈ మందభాగ్యకై నీపడిన క్లేశమును చెప్పుము. నీ సుచరిత్రము నా దౌర్భాగ్యము నడంచి సమాధి నొసంగును.

చిత్ర.—నాఁడు నీమీఁద మీనాయన యేమి యుద్యమించునో యెఱుంగఁ గోరి తత్సభలో నదృశ్యకరణిమై నుంటిని. ప్రకృత మెఱింగితిని. వారు మాకడకు రాకమున్నే మిమ్మిరువురను ద్వారకం జేర్పఁ దలంపుగొని మీకడకు వేఁగుపడిని వచ్చుచుంటిని.

ఉష.—మఱి యేల యట్లు కొనిపోవైతివి సఖీ?

చిత్ర.—దారిలో నారదులవారు వారించిరి.

ఉష.—హా! ఎంతటి పాపాత్మురాలను! ఆ లోకైకకుటుంబికి నయితము అనను కంపనీయనైతిని!

ఆ. దేవమాని యహహా! దీనమందారుండు
జాలి వెట్టె నాకు జాలి లేక;
సకలలోకులకును నీ రిచ్చు మేఘుండు
పిడుగు నైచు భాగ్యవియుతు మీఁద. ౮౩.

చెడ్డకాలమున మంచివారికింగూడ ద్వేషము కలుగును.

చిత్ర.—నీ శ్రేయోవిశేషమునకై వారట్లు చేసిరి.

ఉష.—నాకును శ్రేయమా?

చిత్ర.—నీకడుపులోని మహాపురుషుని శిశురూపలాలితుని నీప్రాణనాథునికి కానుక యిచ్చుభాగ్యము ఎవరిది?

ఉష.—అంతభాగ్యమా!

చిత్ర.—అంతకన్న వేయిమడుంగులు. మఱి యిట్టి దారుణారంభములు సేయ నని నాకు మాట యిమ్ము.

ఉష.—నీవు దివ్యప్రభావవు. నేఁడు నాప్రాణేశ్వరుని నాకు మాపుమువేని, మాట యిచ్చెద. మాపనిచో, నాబుద్ధి నాది గాదు.

---

౮౩ ప.—దీన మందారుండు = దీనులపాలిటి కల్పవృక్షము. జాలి = దుఃఖమును. జాలి = కనికరము వియుతుఁడు = హీనుని.

గంతవ్య = పోవలసిన. ప్రాసాద పృష్ఠమునఁ = మేడపై తలమున. దీప్తి = కాంతి.

చిత్ర.—రాగమ్ము. నాఁడతనిని నీకుం దెచ్చితిని. నేఁడు నిన్నతనికిఁ గొనిపోవచ్చితిని. [అని ఆకాశయానమున ఉషం గొనిపోవును.

---

స్థలకము II.—ఆకాశము.

ఉష.—సఖీ, ఈయాకాశగమనము నాకుఁ గడువింతగా నున్నది. సఖీ, నాతప్పులు మన్నింపుము. నిన్ను బ్రహ్మ నాకై చేసినాఁడు. ప్రాణసఖీ, నాప్రాణేశ్వరులు ఎట్లు ఆరగింతురో, ఎట్లు నిద్రింతురో, ఎట్లెట్లు కాలము పుత్తురో చెప్పఁగలవా?

చిత్ర.—తెలియదా?

ఆ. నిన్నుఁ బాసినట్టిపన్నకానికి నెట్లు
కన్నుఁగవకు నిదుర గల్గునమ్మ?
ఆరగింపు టొక్కయభినయం బగుఁ జుమీ;
క్షణము యుగ మటంచుఁ గనఁగ లేరా? రాగ.

ఉష.—[నిశ్వసించి] ఎంతదారుణచిత్తను చెలీ!

---

స్థలకము III.—చండికాద్వీపము, అంధకారప్రాసాదపృష్ఠము.

చిత్ర.—గంతవ్యదేశమునకు వచ్చితిమి. ఆహా! ఏమిమంచిసమయము! చూడు. ఇతఁడె నీప్రాణవల్లభుఁడు ప్రాసాదపృష్ఠమునం బరుండియున్నాఁడు.

ఉష.—ఔనౌను, దీప్తిచేత నేగాని ఆకృతిచేఁ దెలియరాకున్నాఁడు సఖీ.

చిత్ర.—నీకృత్య మెంతదారుణమో యతనిభాషితముల నెఱుంగఁదవులే. ఈతని శిఖరమందు ఈదట్టంపుటాకుజీబులో నిలిచి పరికింతము గమ్ము. [అట్లు చేయుదురు.

అనిరుద్ధుఁడు యథానిర్దిష్టుఁడు ప్రవేశించును.

అని.—[దగ్గన లేచి కూర్చుండి ఊర్ధ్వము సూచి] ఆహా! నాకొకసాధనము దొరకినది!

ఆ. కప్పుమాల్కి గాఁడ, ఖండేందుతరి నెక్కి
వెల్గుఁదెడ్లు వయిచి విన్నువాఁక

---

రాగి ప.—చంద్రునిలోని నల్లనిభాగ మనెడి యోమాలిమీ, చంద్రరేఖ యనెడి పడవ నెక్కి కిరణము లనెడి తెడ్లు వైచి ఆకాశ మనెడి యేటిలో వడివడిగా జరుగు

నురవడింతు నహహా! యుదిరికే విచ్చెదఁ,
జెలియ యుంకురేవుఁ జేర్పు నన్ను. ౧౫.

హా! లత్యుత్కట్టుఁడు గదా నిశాచరుఁడు! ఓయి ద్విజరాజా,

ఆ. రెండు కరములందు రెండు చేతులు వట్టి
యుషను వీచి నాకు నొసఁగవయ్య;
అట్లు సేయవేని యట్లె నన్నె యెత్తి
యుష కొసంగి సుకృత మొందవయ్య. ౧౬.

ఏమియుం జేయవా? కాలకూటసహోదరుఁడవుగదా.

ఉష.—సన్నిహితను నన్నెఱుంగక యెంత తపించుచున్నాఁడే ఆర్యపుత్త్రుఁడు! చంద్రునిచేఁ జక్రవాకముల కగుగతి దైవముచేత మా కయినది? [ఉలుకు.

అని.—[ఊర్ధ్వ మరసి] ఓయి మేఘుఁడా, నీవుపకరించెద ననుచువా? అట్లని?

ఆ. పవిపతా యటంచుఁ బవి బ్రమోఁగ భీరువు
లులికి తావుదప్పు టుర్వి నిజము;
అట్టె యుఱిమి నీవు నవఘూత్మ యుఁరలింపు
ముషను నాదు పేరు టురమునకును. [ఉలుకు.

అని.—ఏమి? ఉషను గుర్తెఱుఁగ నందువా?

క. ఏయువిద మేని బ్రోలను
నీరుబల తటిన్మతల్లి నిగుఱు గవిసి యు

దున్నావు; ఆశ్చర్యముగా నున్నది! నీకు బంగారము కేవుగా నిచ్చెదను! నన్ను నీ పడవలో ఎక్కించుకొని నాప్రాణేశ్వరి యుండు రేవునకుం గొనిపొమ్ము.

నిశాచరుఁడు=చంద్రుఁడు — రాక్షసుఁడు క్రూరుఁడు ననియు భా.

౧౬ ప.— కరములందు=నీచేతులందు. వీచి=విసరి. సుకృతము=పుణ్యము.

సన్నిహితను=చెంతనున్నదానిని.

౧౭ ప.—పవి=ఇంద్రుని వజ్రాయుధము - పిడుగనుట. భీరువులు = పిఱికివారు—స్త్రీలు. ఉర్వికి=భూమిలో. ఉరలింపుము=దొరలింపుము.

౧౮ ప.—ఏదేనొక చెట్టు దావాగ్నికి మండిపోయి నిగుఱు గప్పి నేలకుం గూలక అట్లే నిలిచియున్న నెట్లు కళాహీనముగా నుండునో, అట్లు నీభార్యయగు మెఱుపుఁ

ళ్లే యున్న దావ హూతతను

వా౯ యనఁ జూపట్టు, నదియె యుష సుమ్ము సఖా. ౮౮.

ఉష.—చెలీ, ఆర్యపుత్రుని యీపరిదేవనమును నేనెట్లు సహింతును!

అని.—నీయువిదను డిందుపఱిచినందులకు నీవు అలిగాదవా? అయ్యా జీమూతా, పఱి యేమియుఁ జేయవేని,

ఆ. ధరణి నెల్లవారు దాత వందురు నిన్ను,
నొక్క కోర్కె నాకు నొసఁగవయ్య,
పుడమికెల్ల నమృతపూరంబు వర్షించి,
పిడుగు నొకటి నాకు విసరవయ్య. ౮౯.

ఉష.—అయ్యో చెలీ, ఈవీను లేఁబిడుగు విను చున్నవి! [ఉలుకు.

చిత్ర.—ఉలుకు పెటపెటకు ఉలికిపడిన చిలుకగా పోయి యీముత్యాలహారమును నీమనోవల్లభుని కిచ్చి తత్క్షణమే రమ్ము ఇదె నిన్ను మార్చితిని.

[ఉష చిలుక యైనది. పెటపెట ఉలుకు. హారముతో చిలుక అనిరుద్ధునిమీఁద వ్రాలును.

అని.— ఆహా! వారిదా, మహోపకారీ, ఇదె నీపిడుగును గ్రహించెద. జన్మ జన్మమునకును కృతజ్ఞుఁడను. [అని చిలుకను సహారము నెదం గొని, సుఖస్పర్శ మభినయించి, పరికించి] ఏమి యిది పిడుగు గాదు, సహారము శుకరాజము. ఆహా! ఏమి దైవవంచన! ఆహా! ఇ దేమి వింత!

తే. పసపుఁబట్టుఱవికజగ్గు పరిఢవిల్ల
సరిదితాఁకుడుచేత మోహమున ముంచు
స్తనయుగముతోడిభామవక్షంబుఁ బోలి
చిత్తమున కెక్కు నీముద్దుఁజిల్క యక్క. ౯౦.

దీనితో హారమేమి? ఇది యెవరిదో బుద్ధిమంతులది పంజరపుఁ జిలుక, తప్పించుకొని

దీఁగ నా ప్రియతమ యగు నుష వ్రోల కాంతిహీన మై వెలవెలఁబోవుచుండును, ఆ గుర్తుంబట్టి ఉషను తెలిసికోవయ్యా ఓమిత్రుఁడా.

౯౦ ప.—అక్క=వక్షము.

బుద్ధిమంతులది=సిరిగలవారిది.

వచ్చి తరువాత నలవాటులేమి నుఱుకున నులికి యిటుం బడినది, దీనిం దేర్చెద. [అనియెత్తి యక్కున నిడికొని ముద్దుగొని యుపలాలించుచు] ఆహాహా !

ఉ. మాటలు నేర్పి శిష్యువలె, మాటికిఁ బండ్లిడి బిడ్డకైవడిన్,
మేటికుచాద్రులన్ నిలిపి మెచ్చుచు ముద్దిడి కాంతునింబలెన్,
గాటపుఁగూర్మిఁ జెల్లెలినిగాఁ జెలునల్ చెయిపీడ కున్నునన్,
రాటె యొసంగెనో చిలుకరాచిరో నీకును బంధనక్రియల్ ? ౯౧.

ఆహా ! ఇట్టి హారము నే మన్మాంకితమును ప్రియావత్సోరుహముల నే నలంకరణ మొంచితిని. [మెలుము.] ఈ మెలుమునం దెలిసినది, అదే యీహారము మేఘభవ మౌక్తికముల రచించినది, విద్యాధర చక్రవర్తి మాతాతకు కానుక యిడినది. [మెలుము.] ఇవి యేమి యీయక్షరములు. [చదువుట నభినయించి] 'ఉష' ! ఆహాహా !

[అని ఆనందజడుఁడై మూర్ఛిల్లును. చిలుక కలకలం గూయుచు రెక్కల నతనివీచును. అనిరుద్ధుఁడు తేరును. చిలుక అనిరుద్ధుని కరఁగి యెగిరిపోయి చిత్రకడనుసాకృతిం దాల్చి నిలుచును.

అని.—[చిలుక పోయినవలను సూచుచు] ఏమి యీమాయ ! ప్రియ దీనిం బంపినదా నాప్రాణములు నిలుపుటకు? నాయుపలాలనంబుల నింకనింకఁ గోరినదైవడి నిది నాకు వశంవదయై యుండినది. నాప్రియయే యిది. సందేహము లేదు. అయ్యో! వచ్చియు ప్రియ యిట్లు క్షణదృష్టనష్ట గావలయునా ! హా ! చిలుక యయ్యును పలుకదాయెఁగదా ! హా ప్రేయసీ !

ఉష.—సఖీ, ఒక్క మాటకేని నెలవీయ వయితివే !

చిత్ర.—అనియమితేంద్రియులకు ఆపన్నశుభములును దూరము లగును.

అని.—ఇట్లనుగృహీతునికి పరణాశంస యేల ! వెండియు ఇట్టి యీసమాగమ మేని దైవ మొసంగదా ! ఈమాలు వచ్చినప్పుడు,

క. ఒక్కుమ్మడి ముద్దులజడిఁ
జిక్కువఱిచి పులుపి పల్కుఁ జేసెదఁ జిల్కన్ ;
అక్కజపున్బిగికౌఁగిట
నుక్కిరిబిక్కిరిగ నొక్కి యుషఁ గావింతున్. ౯౨.

---

౯౧ ప.—మేటికుచాద్రులన్=గొప్పచనుఁగొండలమీఁద. రాటె=ఆయాసము నే.

౯౨. ప. ఒక్కుమ్మడిన్=ఒక్కసారిగా. ముద్దులజడిన్=జడివాన కొట్టినట్లు ఎడ తెఱపి లేకుండ ముద్దులుపెట్టుకొని. అక్కజపు=ఆశ్చర్యకర మయిన.

చిత్ర —సఖీ, వినుచున్నావా ?

ఉష.—[ఆనందబాష్పములతో] ఇంక దారుణారంభములు సేయను.

అని.—ఇపుడే పిడుగుం గోరితిని, ఇపుడే చిరాయువుం గోరుచున్నాను. ఏమినింతప్రపంచ మిది ? స్వప్నమా ! ఇంద్రజాలమా ! [ఉలుకు.] మేనుదేవా, కాదు వాస్తవ మనుచున్నావా ? నీవు ప్రాణులయాంతర మెఱుంగుదువు గదా. [ఉలుకు.

పురుషుఁడు.—[ప్రవేశించి] మహాప్రభూ, ప్రబలవర్షము వచ్చుచున్నది. దేవరవారు లోపల శయన మంగీకరింపఁదగును.

అని.—[ఆత్మగతము] ఆ! ఈచోటు విడువఁ జాల. కానిమ్ము, వెండియు వచ్చెదంగాక. [అని లేచి ఆచెట్టును నిర్వర్ణించును. ఉసిరికచినుకులు రాలును.

అని.—వెండియు ప్రియాసమాగమ మగునందాఁక ఈహారము నాకు జీవగఱ్ఱ. ఓ హారమా,

తే. నాయెదను మున్ను నీ విట్టినయ మెఱుఁగవు,
మెలఁత చనుగట్టుతోఁ గొంత మెలఁగినంత
విరహితుని కిట్లు సంజీవకరణి వైతి ;
వున్నతులతోడిసంగడి వన్నె యిడదె ? ౯3.

[అని నిష్క్రమించును.

ఉష.—హా ! నేనెంతదారుణహృదయను !

చిత్ర.—నెచ్చెలీ, చూడు నీదయితుని నుపచారములు.

ఉష.—ఎంతకాల మార్యపుత్త్రునికి ఈపరోపచారక్లేశము ?

చిత్ర.—తాతకు ఈతనిపై తలఁపు గలుగువఱకు ; సీతాపునకుం బోయి యాయాపన్నశరణ్యు నుపాసింపుము.

ఉష.—నీయాజ్ఞ.

చిత్ర.—మఱి పోదము పద.

ఉష.—ఆర్యపుత్త్రుని వదలిరా నాకాళ్లాడకున్నవి.

చిత్ర.—మనలను వెదకకముందే పోయి చేరవలయును.

ఉష.—అట నన్ను విడనాడవుగదా ?

---

౯3. ప.—నయము=నేర్పును. ఉన్నతులతోడి = గొప్పవారితో నైన (తుంగము లయిన వానితో నని కుచపరము). సంగడి=సహవాసము.

చిత్ర.—ఆమాట నీనాథుని నీవు గలయుందాఁక నేఁగదా ?

ఉష.—అది గల్గునా ?

చిత్ర.—తప్పక, త్వరలో. తడసితిమి. మన కిప్పుడు క్షణ మొకనిధి. ఈకార్యమయినంతకుం దొలఁగి పైమార్గమునం బోవుదము. రా రమ్ము. ఆర్తత్రాణపరాయణు శ్రీకృష్ణుం బాడుచుం బోదము.

ఉష.—నీయిష్టము.

ఇరువురు.—[గాన మభినయించుచు]

(తమవోఁగ)

కావవే పాంచాలిఁ గరుణాసముద్ర?
కావవే మునిరాజుకాంత నహల్యఁ ?
గావవే కపిరాజుఁ? గావవే కరిని?
గావవే ప్రణతు లంకాపతియనుజుఁ ?
గావవే ప్రహ్లాదుఁ? గావవే ధ్రువునిఁ?
గావవే కుబ్జను? గావవే పశుపులఁ ?
గావవేల త్వదేకగతుల నీమమ్ముఁ?
గావు కావుము రమాకాంతాకళత్ర. ౯౮.

[అని నిష్క్రమింతురు.

పంచమాంకము ముగిసినది.

---

పాంచాలిన్=ద్రౌపదిని. మునిరాజు=గౌతమునివారి. కపిరాజున్ = సుగ్రీవుని. కరిన్=గజేంద్రుని. లంకాపతియనుజున్=విభీషణుని. త్వదేకగతులన్=నీ వొక్కఁడవే గతిగాఁ గలవారిని (నిన్నే నమ్ముకొని యున్నవారిని). రమాకాంతాకళత్రా=లక్ష్మీ రమణి భార్యగాఁ గలవాఁడా.

## ప్ర వే శ క ము.

---

స్థలకము:—ద్వారక, శ్రీకృష్ణప్రాసాదోద్యానము.

బం భ రి కా కీ ర వా ణు లు ప్రవేశింతురు.

బంభ.—[ఊర్ధ్వము గాంచి] వోశేవోశే, కీరవాణీ, చూడు చూడు ఆజ్యోతిని.

[ఇరువురును ఊర్ధ్వము పరికింతురు.

బంభ.—ఏమిటే ఆజ్యోతి ? నగర్లోనుంచి వుత్తరంగా వెళ్లి మాయమైంది !

కీర.—యిందాక యిది నగర్లోకి వెళ్లింది. మఱి యిదేమిటో తెలవలేదు. అల్లదుగో నాడాయనయ్య నగరికాణ్ణుంచే యేమో గొణుక్కొంటూ వొస్తున్నాడు. ఆయన్నడుగుదాం:

వి దూ ష కుం డు యథానిర్దిష్టుండు ప్రవేశించును.

విదూ.—[తనలో తాను నవ్వుకొనుచు] అప్పుడు నేను సభా మంటపంలో తగిలించిన పఠం యిప్పుడు పనికొచ్చింది. ఆహాహా !

కీర.—యేమిటయ్యో నాడాయనయ్యా, అంతా నీలో నువ్వే! వెఱ్ఱెత్తిందా అయ్యవారా ?

విదూ.—సంతోషం సంతోషం. ఈరోజు ‘ఆనంద మానంద మాయనే.’

బంభ.—ఏమి సంతోసమయ్యా, మాకొంచం చెప్పవయ్యా, మేమూ కొంచం నవ్వుతాం.

విదూ.—హెహెహెహె [అని నవ్వి] మీతో ఎందుకూ చెప్పడం ?

బంభ.—అయితే దాచుకోవయ్యా.

కీర.—వేళాకోళం చెయ్యక చెప్పవయ్యా, ఆవెల్తురేమిటో కొండుతూర్ల అవుపడ్డది.

విదూ.—నారదబ్బ మహాముని.

[అని గడ్డము దువ్వుచు టింగ్టింగని వీణవాయించుట ననుకరించును.

ఇరువురు.—[ఆశ్చర్యపడుచు, నవ్వి] వెఱ్ఱిమో నిశ్చయమే బాపనయ్యకి.

కీర.—అనిరుద్ధమహారాజుసంగతి యేమైనా తెలిసిందా నాడాయనయ్యా ?

విదూ.—చెప్తా పట్టు. అనిరుద్ధమహారాజు బాణాసురుడికి పట్టుబడి అదేదో ఒకద్వీపంలో, దానిపేరు మరచిపోయినా, బందిఖానాలో వున్నాడట.

[ఇరువురు ఆశ్చర్యపడుచు విందురు.

విదూ.—నేను సభలో వేలగట్టిన పఠం బాణాసురుడి కూతురట, వుషగారట. మరేమునికీ తెలిసిందిగాదుగాని యీముని యిక్కడా అక్కడా కూడా తంటాకోరు గనక యీ నారదబ్బమునికి తెలిసింది. ఆమెనికూడా తండ్రి ఒక ద్వీపాంతరంలో ఖైదుచేశాడట, కృష్ణమరాజు రుక్మిణయ్యగారూ మనమణ్ణి మనమరాల్నీ తీసుకొని రావడానికోసం యిప్పుడే గరుడయ్యనెక్కి బాణాసురుడిమీదికి ప్రయాణం. సాయంత్రంలోపల అనిరుద్ధమహారాజునీ ఆయనభార్యనీ చూస్తాం. నేడే గ్రహప్రవేశం. అప్పుడే నగరాలంకారానికికూడా ఆజ్ఞ అయింది; రేపు మేమంతా ప్రప్పుధప్పుళాలు క్రొట్టడం, మీరంతా యెంగిలాకులెత్తడం. "ఆనంద మానంద మాయెనే !"

[అని చంకలు గ్రుద్దుకొనును.

కీర.—అమ్మయ్యా ! యెంతపుణ్యమే ! [అని బంభరికను కౌఁగిలించును.

విదూ.—లంజకూతురా, నేను శుభవార్త చెప్తే నువ్వు దాన్ని కౌగిలించుకొంటావేమీ ? [అని కీరవాణిమీఁదికి ఎగురును.

కీర.—జంట మట్టుకొని లాగే, చెడిబదికినబాపడు ముకుదాడు లాగిన యెద్దులాగ లొంగుతాడు.

విదూ.—లంజకూతుళ్లారా, నే నేమీ లాగలేనా, నే నేమీ లాగలేనా ?

[అని ఒకతెను మార్చి ఒకతెను తఱుమును.

కీర.—వోలే ఆపాడుబాపడికాణ్ణించి యెల్లే !

[అని యిరువురు పలాయిత లగుదురు.

విదూ.—ఆబాణుడు వాళ్లనిద్దర్ని తలా వొక కోటలో పెడితే, నేను మిమ్మల్నిద్దర్ని తలా వొక తోటలో పెట్టలేనా ? లంజలారా !

[అని వెంటఁబడును. అందఱును నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

---

# షష్ఠాంకము.

స్థలకము:—శోణపురి, బాణసభామంటపము.

## బాణాహ్లాదనకుంభాండగంభీరవేదులు ఉపవిష్టులై ప్రవేశింతురు.

బాణు.—మంత్రిసత్తమా, ఈకన్యాంతఃపురద్రోహి యువకుఁడో కనుంగొనవలె వుగదా.

కుంభా.—దేవా, ఇతఁడు అసురుఁడు గాఁడు, అమరుఁడునుం గాఁడు. ఇతఁడెవరో మహాప్రభావుఁడు మర్త్యుఁడే గావలయు.

బాణు.—[పండ్లు కొఱుకుచు] మహాప్రభావుఁడేమోయి! నీకేమేని బట్టుమాన్య మిచ్చినాఁడా? నిన్ను త్రోసినత్రోపునకే మహాప్రభావుఁడా? ఆమాట వెండియు నాచెవిని వేసితివేని వానిని మాని వానిదండన నీకు విధించెద. నీవోఁటిపందలకు అందఱును మహాప్రభావులే.

కుంభా.—అపరాధిని, మన్నింపవలయును.

బాణు.—మఱి మర్త్యుఁడేని మనరాక్షసులచే భక్షింపింతమా?

ఆహ్లా.—నరఖాదనులకు సైతము అట్టిసుకుమారసుందరమూర్తిని గోట మీట నేనియు మనసు వచ్చునా!

బాణు.—వేశ్యాభ్రాతవుగా నీచెల్లెలికి తగినసరసుఁడని తెచ్చితివా?

ఆహ్లా.—అప్పు డతఁడు నాచెల్లెలిపల్కు-మంత్రమునకుం గట్టుపడఁడేని తమనాగపాశమునకుఁ గట్టుపడలే దని తలంపుఁడు.

బాణు.—కాపురా, మూర్ఖా, నీమాఁదిశికాయి ముఖదాక్షిణ్యమునకుఁ గట్టుపడినాఁడురా.

గంభీ.—[ఏడుపుమొగముతో డొక్క మాపుచు] అప్పుడు వాఁడు తన్నినతన్ను నాకిఁక నీజన్మములో కుదురునది గాదు.

బాణు.—ఛీ! నిర్భాగ్యుఁడా! పందమొగము చూపుదువా నాకు! [అని కత్తి యెత్తి] పో నామ్రోల నుండకు.

---

అమరుఁడు=దేవత. మర్త్యుఁడు=మనుష్యుఁడు. నరఖాదనులకు=మనుష్యభోజనులకు. శికాయిఁ దనఁగా రాజు ఉంచుకొన్నదాని సహోదరుఁడు.

[అని కొట్టఁబోవును. గంభీరవేది ఏడుపు మొగముతో తలఁగి దూరమునఁ గూర్చుండును.

బాణా.—మతీ, చండికి వానిని బలివేయవలసినది.

ఆహ్లా.—అసురకులక్షయకారికృత్య మిది. మతీ, మీకు శక్యము గానేరదు.

బాణా.—ఎక్కడ నేర్చితివిరా యీనీతులు; మూర్ఖా ?

[అని కత్తి దూయును. కుంభాండుఁడు కత్తి పట్టి ఆఁపును.

[నేపథ్యమున మహాకలకలము.]

[ప్రచండవాతము.]

పతాకాధికృతుఁడు.—[సంభ్రాంతుఁడై ప్రవేశించి] జయము జయము ఏలినవారికి. పతాకాధికృతుఁడను. లోకాలోకేశ్వరా, ధ్వజము విఱిగిపోయినది! ఉత్పాతవాతము కొట్టినది! చెట్లన్నియు విఱిగి ముక్కల కడ్డముగా పడినవి! మేడలు కూలినవి! అగ్నిప్రాకారము ఆఱిపోయి, రోదసీకుహరమెల్ల పొగనిండినది! ఎల్లవారికి లేచి పట్టణ మంతయు దూరమునకు మండుచున్న ట్లగపడుచున్నది! ఊపిరి తిరుగదు! ధూళిచీఁకటిచేతను పొగచీఁకటిచేతను ఎవనియొడలు వాని కగపడుట లేదు! ఊరంతయు ఇక్కడిది దక్కడ అక్కడిది దిక్కడ! గుర్తు పోయినది. ఇందులో సుడిగాడ్పు! నేను సంభ్రాంతుఁడనై ధ్వజముం గౌఁగిలించుకొంటిని. అది పటాలున అక్కడ విఱిగి యిక్కడ సింహద్వారమునఁ బడినది. నేనును దానితో నిట పడి చావు తప్పి లోనికిఁ జాఱితిని. అటుపైన యేలినవారిచిత్తము.

[అందఱును సంభ్రాంతు లగుదురు.

కుంభా.—[ఆత్మగతము] అయ్యో అపశకునము !

బాణా.[స్మరణ మభినయించి] ఆహా ! భాగ్యము ! ఈదినము నాబాహు కండూతి వాయును. మంత్రివరా, పోయి క్షణములో యుద్ధసన్నాహ మొనర్పుము. ముందుగా నింద్రాదులను బంది నుంపుము. ఓరీ టెక్కెముగా, నీపని చూచుకొమ్ము.

పతా.—[ఆత్మగతము] టెక్కెము విఱిగినది. ఇఁక నాపని యే మున్నది చూచుకొనుటకు !

కుంభా.— } దేవరయాజ్ఞ. [అని నిష్క్రమింతురు.
పతా.— }

బాణా.—[స్వగతము] ఎవరు నిర్మించియుందు రీయుత్పాతమును ?

---

పతాకా=ధ్వజ. రోదసీకుహరము=భూమ్యాకాశమధ్యప్రదేశము.

[నేపథ్యమున]

(స్రగ్ధర)

చక్షుర్యుగ్మంబు నృత్యత్తరుణరుచి శుచిభాస్వద్ద్వయీబుద్ధిఁ గొల్పన్,
పక్షద్వంద్వంబు సాంధ్యప్రథమచరమదిగ్భాగవిభ్రాంతి సేయన్,
రూక్షత్రోటీపునర్భూరుపురుషమణిసంరూపితేంద్రాయుధర్ద్ధిం
బక్షీంద్రుం డద్దిరా యభ్రమున గళగుహావ్యాప్తవిశ్వుండు పొల్చెన్.

ఆహ్లా.—గరుడపక్షవాతము నాయనా ద్వారకనుండి తరలినమాత్రాన తమ మయూరధ్వజముం గూల్చినది.

బాణు.—కానీ; గరుడునికి పక్షవాత మొసంగెద.

[నేపథ్యమున ప్రచండశంఖధ్వని.]

బాణు.—ఛీ! ఏమి యీపాడుధ్వని!

[గంభీరవేది యటికి వెదకిలంబడి తన్నుకొనును.

[నేపథ్యమున]

(పంచచామరము)

నభంబు ప్రీల, మేరురోహణంబు లుర్ల, నాగలో
కభూము లట్టె బ్రయ్య, సప్తకంధు లింకఁ, గుక్షిలో
గుభి ల్లుభి ల్లుభి ల్లటంచు గొట్టుపిడ్గుగోల్సునా
ఢభాం ఢఢా మటంచు మ్రోఁగుఁ బాంచజన్య మద్దిరా. ౯౬.

బాణు.—ఈ నిర్భాగ్యుఁడు కుంభాండుఁడు సేయుచున్న యుద్ధసన్నాహము ఈ బట్టుపొగడికయే గావలయు!

[గంభీరవేది అవర్ణనకు మఱియు నుబికి తన్నుకొనును.

---

౯౫ ప.—రెండుకన్నులును నర్తించుచున్న మెఱుపుదీఁగలతోఁ గూడుకొన్న యిద్దఱు వేసవిసూర్యు లనెడి భ్రమను పుట్టించుచుండఁగా, రెండు ఱెక్కలును సంధ్యాకాలములయందలి తూర్పుపడమర లనెడి భ్రమను కలిగించుచుండఁగా, కఠోరము లయిన గోళ్లను ముక్కు ననెడి వజ్రనిర్మితేంద్రాయుధముల సమృద్ధితో, గరుత్మంతుఁడు ఆహా లోకమంతయు ఇముడునంతటి గుహవంటి నోరు దెఱచుకొని ఆకాశమున వచ్చుచున్నాఁడు.

పక్షవాతము = ఱెక్కలగాలి (ఱెక్కలుస వాత వ్యాధి.)

బాణు.—[వీక్షించి] వీని కేమి రోగము ?

ఆహ్లా.—పాంచజన్యజ్వరము. వీఁడే గదా నాయనా తమరు కోరుకొన్న యల్లుఁడు !

బాణు.—ఝుం దీపాపిష్టుని పరిమార్చెద.

[అని లేవ నుంకించును. గంభీరవేది పరుపున నిష్క్రమించును.

**శోణపురమునాయకుఁడు.**—[సంభ్రాంతుఁడై ప్రవేశించి] జయము జయము ఏలిన వారికి. లోకనాయకా, శోణపురమునాయకుఁడను. గరుడారూఢుఁడు సభార్యుఁడు కృష్ణుఁడు వచ్చియున్నాఁడు, ద్వారకావాసి.

బాణు.—[ఆలోచించి] అస్మత్కుక్షైకవిద్వేషి యాదవవటువు మాకరప్రతాపములకు భీతిల్లి మాపాదములు గొలువ వచ్చినాఁడా ?

శోణ.—మహాప్రభూ, ఆకాశమునుండియే యిట్లు నాతోఁ బలికినాఁడు:—

బాణు.—ఏమని ?

శోణ.—"మామనుమనిని ఆతనిభార్యను చెఱనుంచినాఁడఁట— అనియర్ధోక్తి లో] లోకేశ్వరా, ఆయనమాట వలెనే ఆవేగమున నాకోట వచ్చినది. మన్నింపవలయును. దేవా. [అని నేల వ్రాలును.

బాణు.—వానిమాటగానే చెప్పు.

శోణ.—దేవరయాజ్ఞ. "చెఱ నుంచినాఁడఁట బాణుఁడు, వారిని తెచ్చి యీక్షణము మాకడ నిడుటయో, మాతో పోరి యమసదనంబునం బడుటయో, రెంటనొక్కటి ఏతత్క్షణము నిశ్చయించుకొమ్మను బాణుని." అని పలికినాఁడు.

బాణు.—ఏమీ ! ఈయాదవవటువుసహంకారముద్ర ! [తల యూఁచి] వీని మనుమఁడా వాఁడు ! ఇదె యుత్తరము;—

క. చండికి వానిని బలి యిడ
నుండితి; నిన్నతనిదుఃఖ మొందక యుండన్
ఖండించి నీశిరమె మును
ఖండేందువతంసుసతికిఁ గానిక యిడెదన్.

ఇట్లని మామాటగాఁ జెప్పుము.

---

ఆవేగమునన్=తొట్రుపాటుచేత. సదనంబు=ఇల్లు.

౯౨ ప.—ఖండేందువతంసుసతికిన్ = చంద్రరేఖను శిరమునఁ దాల్చువాఁడగు శివునిభార్యకు చండికి.

కోవు.—దేవరయాజ్ఞ. [అని నిష్క్రమించును.

బాణు.—కయ్యమునకు వీనికి స్త్రీ యేల? అందుదానిపాటి వీఁడు పోరలేఁడా?

అహ్లా.—తమబాహుకండూతి యడంప నాతండును, మనుమరాలిని గృహప్రవేశాగ్రము కొనిపోవ నామెయు, వచ్చినారు నాయనా. నేఁ డసుర కులమునకు వారి వలన శరణమంగళమో మరణమంగళమో రెంటి నొకటి తప్పదు.

బాణు.—పందా, శరణమంగళ మేమిరా! ఇదె నీతో చండికి మూఁడుబలులు.

[అని కత్తి యెత్తును. అది క్రిందఁ బడును. అహ్లాదనుఁడు దాని నెత్తి తండ్రిచేత నిడును. బాణుఁడు దానిం గైకొని కోపజడుఁడై యూఁలుముచు ఊఁగుచు ఉండును.

కుంభా.—[ప్రవేశించి] దేవా, సన్నాహ మైనది. ఆయుధాగారముగుండ తరల వచ్చును. [అందఱు తరలుదురు.

[నేపథ్యమున, ఉత్పాతవర్ణన. అందఱు ఆశ్చర్యమున విందురు.

రాజధాని నాలుగు బ్రద్దలుగా చీలినది! రక్తము వర్షించుచున్నది! కొండలు నిలువుగా పగులుచున్నవి. గండశిలలు గురియుచున్నవి? వింతమెఱుపులు పదఁటంట పొడ తెంచి కన్నులం బగుల్చుచున్నవి! తుపానులోని యోడవలె భూమి యిటు నటు నొఱగి అల్లల్లాడుచున్నది! కన్నులలో కత్తులు జ్వలించుచున్నవి! ఎటు చూచినను మొండెము లగపడుచున్నవి! హా! ఇట్టియుత్పాతములు ఎన్నఁడును వినము కనము! నేఁడు అసురకులక్షయము!

బాణు.—ఆ నిర్భాగ్యుఁడు గంభీరవేగి యిందఁలకా బ్రదికి యున్నాఁడు! మంచిది! గుండెగలవారెల్ల నాతోఁ రావచ్చును, ప్రాణము తీపైనవారు పోవచ్చును! [అని 'ధూళీపాళీకరింతుణ్' ఇత్యాది పఠించి, వామబాహుస్పందనము సూచించి, ఆత్మగతము,] ఏమి యీబాహువులును ఆపాపాత్ముని గంభీరవేదిసే అనువదించుచున్నవి! ఏమైన గానిమ్ము.

(వనమయూరము)

ఇల్లిదిగో గొల్లవటు నిప్పుడె వధింతుణ్.
మల్లునికి నాకుఁ బ్రతిమల్లుఁ డిసి పీఁడా!

---

వామబాహుస్పందనము=ఎడమ భుజములు అదరుట - అపజయ సూచకము.

గాథ.—వటుణ్=బాలుని. మల్లునికిణ్=జెట్టికి. ఇసి=ఛీ. భిల్లుఁడా=కిరాతుఁడు.

భిల్లుఁ డహా ! ధూర్తుఁ డయి వేషబము సేయఁగా
గల్లవరముం బుడికెఁ గావలయు నాకుఁగా. ౯౮.

ఇదేమి ! నేలను నింటికి నొక్కఁడే పురుషుఁడు నాలుగు బాహువులు దక్క కడమ లెక్కలేని బాహువులు ఖండితము లై స్కంధపరంపరనుండి నెత్తురుధారలు దుముక నగపడుచున్నాఁడు ! [విమర్శించి] ఏమేని యగుఁగాక. ఈవటువు నంపను.

['ఇల్లిదిగో' ఇత్యాది పఠించుచు వీరావేశంబున నిష్క్రమించును. ఇతరులు మొగమొగంబులు సూచుకొని సాటోపంబుగ నిష్క్రమింతురు.

షష్ఠాంకము ముగిసినది.

——:O:——

(కిరాతరూపముం జెందినశివుఁడు.)ధూర్తుఁడు=వంచకుఁడు. వేడబము=మాయ. పుడికెఁగా=ఇచ్చెను.—కల్లవర మెట్లనఁగా బాణునివిూఁదికి వీరుని పంపక గొల్లనిఁ బంపుటచేత.

# శుద్ధవిష్కంభము.

---

స్థలము:—శోణపురి, ఆకాశము.

చిత్రరేఖ ప్రవేశించును.

చిత్ర.—ఉష నావలన బాణమాధవసమరసంరంభంబు విని 'పతిపక్షము గెలిచిన తండ్రికిడుమ, తండ్రిపక్షము గెలిచిన పతికిడుమ' అని కలగుండువడిన విధమునకు ఇప్పటికిని నాగుండియ జల్లుమనుచున్నది! సమరపర్యవసాన మెఱుంగుటకై దాని చిత్తము తామరాకుమీఁదినీటిబొట్టువలె తత్తఱిల్లుచున్నది. [నిర్వర్ణించి] హా! యుద్ధమన నిట్టిదా! బాపురే! బాణమహారాజుతో ద్వంద్వయుద్ధక్రీడ సల్పుచునే ఈద్వారావతీవల్లభుఁడు ఎంతలో సప్తసాగరములకుం బయిగా అష్టమము నీరుధిరసాగరమును సృజించినాఁడు! ఇఁక నీద్వంద్వసమరము నిష్ప్రతిహతరంబుగ వర్ధిల్లం గావలయును. ఆహాహా! ఏమి యిది! బాణమహారాజు ఉవ్వెత్తుగ కత్తిసామునే మెఱపులమేరువైనాఁడు! హా! ఇఁక నేమి గనవలయును! నల్లగల్వతూండ్లకట్టునుం బోలె నీలత్క్ష్మకశత్రుఁడు నందకంబున మహారాజబాహుదండభారంబు నొత్తివైచినాఁడు! హా! మహారాజు నెత్తుటిగొట్టములకేళాకూళియై ధరణి కొఱగినాఁడు! అయ్యో! ఈవృత్తాంతమును ఉషకెట్లు చెల్పుదును! పోయి కోమలహృదయకు ప్రాణసందేహంబు గాకుండం జెప్పెద. [అని నిష్క్రమించును.

శుద్ధవిష్కంభము ముగిసినది.

---

సమర=యుద్ధ. ఇడుమ=కీడు. రుధిర=నెత్తుటి. నందకంబు = శ్రీకృష్ణులవారి కత్తిపేరు. కేళాకూళి=జలయంత్రము (ఫౌంటేనా).

# సప్తమాంకము.

---

స్థలకము:—శోణపురి, బాణసభామంటపము.

రుక్మిణీశ్రీకృష్ణులు బాణాహ్లాదన కుంభాండ
గంభీరవేదులును, రాణియు,
యథావిభవము పరివారంబును, ప్రవేశింతురు.

బాణు.—[శ్రీకృష్ణు నుద్దేశించి] పరమపురుషా, వేయిబాహువులకును నాలుగు శేషించినవి. ఒడలెల్ల దుస్సహ వేదనలు పొడముచున్నవి. కావుకావు మార్తశరణ్యా.

[అని మూర్ఛిల్లి వ్రాలును.

రాణి.—పతిభిక్షము పతిభిక్షము పతిభిక్ష మిడుము త్రిలోకజననీ.

[అని మోడిమొగ్గి రుక్మిణిపాదములకడం ద్రెళ్లును.

ఆహ్లా.—ప్రహ్లాదరక్షకా, మానాయనం గావుము.

[అని శ్రీకృష్ణునిపాదములకడం ద్రెళ్లును.

రుక్మిణి.—శరణార్థుల ననుకంపనీయులం గావవేమి యార్యపుత్రా?

శ్రీకృష్ణుఁడు—లే లెమ్ము, వీరావతంసా, బాణదానవా.

[బాణుఁడు నిద్రోత్థితుఁడువోలె లేచి కేల్మోడ్చి శ్రీకృష్ణుని డాయును. రాణియు ఆహ్లాదనుఁడును లేచి కేల్మోడ్చి నిలుతురు.

శ్రీకృష్ణు.—[బాణుని మెయిం దడవుచు] ఓయి వీరప్రకాండ,

(వనమయూరము.)

అచ్చితిని నీతనయు కర్థితము లెల్లన్,
మెచ్చితిని బీరమున మేటివని నిన్నున్,
ఇచ్చితిని వజ్రతను వింపుమెయి నీకున్,
గ్రుచ్చితిని కౌఁగిటను గూర్మిమెయి నిన్నున్.

బాణా, మహావీర, నీవును మావలె చతుర్భుజుండ వైతివి. నీకు సత్వోత్కర్ష మొసంగితిని. దివ్యజ్ఞానము పిదప నిచ్చెద.

---

అనుకంపనీయులన్=కనికరింపఁదగినవారిని.

బాణు.—బహుజన్మముల గొప్పతప మొనర్చితిని. [ఉన్నట్లుండి, ఆశ్చర్యముతో]

శా. దేవా, దేవగురూ, భవత్కరుణచే దివ్యేక్షణంబబ్బె నాఁ
కీవిశ్వం బఖిలంబు నీక్షణములో నీవే యటంచుం బ్రబో
ధావిర్భావము గల్గె; నాది రహితం బైనట్టియోతత్త్వమా,
ప్రోవ న్వచ్చితివయ్య నన్నదు; నహాహా పుణ్యం! బహాహా శ్రీహరీ!

[అని రుక్మిణీకృష్ణుల పాదములం ద్రెళ్లును.

రుక్మి.—ఓయి బాణా, లేలెమ్ము. ఆర్యపుత్త్రమిత్త్రునికి నీ కింకేమి కొఱంతే! మా శిశువులం జూడ మా చిత్త ముత్తలపడుచున్నది, ఏరీ వా రిరువురు?

బాణు.—[లేచి] జగజ్జననీ,

క. నా దుండగమున నయయో!
గాదిలి శిశు లున్నవారు కడలిపరికిఁ నో
పైదలి కీవల నావలఁ
బ్రాదోషిక కోకమిథున పరుషవ్రతు లై. ౧౦౧

[రుక్మిణి శ్రీకృష్ణుం జూచును. ఇతరులు సంభ్రాంతులై ద్వారములం జూతురు. శివజ్వర విష్ణుజ్వరములు ఎదురెదురుద్వారముల ప్రవేశించి ఒండొరులను జుట్టు పట్టుకొందురు. అందఱు సంభ్రాంతులై కందురు.

శ్రీకృష్ణు.—[చేయెత్తి] ఎవరురా మీరు?

శివ.—దేవా, నేను శివభక్తుఁడను శివజ్వరమను.

విష్ణు.—దేవా, నేను భవద్భక్తుఁడను విష్ణుజ్వరమను.

శివ.—బాణపక్షమున నేనును,

విష్ణు.—దేవర పక్షమున నేనును,

ఇరువురు.—పోరాడి ఒకరి నొకరము ముగించుకొనుచున్నారము.

---

౧౦౧ ప.—అయ్యయ్యో నా దుర్మార్గముచేత ప్రియశిశువులు (ఉషానిరుద్ధులు) సముద్రమే పావడగాఁ గలదైన భూదేవికి రెండువైపులను (ఒకరి కొకరు అత్యంతదూరమున) చక్రవాక దంపతులు రాత్రియం దాచరించు కఠినవ్రతము కలవారై ఉన్నారు. [చక్రవాకములను రాత్రి ఎడఁబాపు.]

శ్రీకృష్ణ.—మేలు మేలు! మీ మీ సఖుల మైన పిమ్మట మాకై మీ కయ్యము లేలరా?

శివ.—[విష్ణుజ్వరమును మాపుచు] వీనికి బుద్ధి లేక.

విష్ణు.—[శివజ్వరమును మాపుచు] వీనికి బుద్ధి లేక.

శ్రీకృష్ణ.—మంచిది. ఈపని చేయుఁడు బుద్ధి వచ్చును. ఓరీ శివజ్వరమా, నీవు సౌమ్యరూపంబున చండికాద్వీపమునుండి అనిరుద్ధుని క్షణములో తెమ్ము, ప్రత్యయార్థము ఆహ్లాదనుని కొనిపొమ్ము.

శివ.—దేవరయాజ్ఞ.

ఆహ్లా.—మహాప్రసాదము. [నిష్క్రమింతురు.

శ్రీకృష్ణ.—ఓరీ విష్ణుజ్వరమా, నీవు దివ్యస్త్రీరూపమున, భ్రాంతిద్వీపమునుండి క్షణములో ఉషను సపరివారం దోడ్కొని రమ్ము. ప్రత్యయార్థము మహారాజ్ఞిని తోడ్కొని పొమ్ము.

విష్ణు.—దేవరయాజ్ఞ.

రాణి.—అహో! లోకగురునికరుణ! [ఇరువురు నిష్క్రమింతురు.

బాణు.—[జనాంతికము] కుంభాండా, ఇంద్రాదులను రంభాదులను విడుదలచేసి రమ్ము.

కుంభా.—[జనాంతికము] చిత్తము. [అని పోయి మరలి వచ్చి] ఆజ్ఞ చేసితిని. వచ్చుచున్నారు.

ఇంద్రాదులు ప్రవేశింతురు.

ఇంద్రుఁడు.—[దేవతలతో జనాంతికము] నాఁడు నారదముని నాటించిననీతిబీజము నేఁటికి ఫలించినది.

దేవతలు.—లేఖర్షభ, సర్వము కాలపక్వము గావలయుఁగదా!

ఇంద్రాదులు.—జయము జయము ఆపదుద్ధారకునకు. అమరులము ప్రణమిల్లుచున్నారము. [అని నమస్కరించి]

ఉ. నీటను దాఁగి కొండతొలి నెక్కొని నేలను బొత్తి వెట్టి పె
న్గోటను జక్కు సేసి యడుగుల్ సగ మేదియు దవ్వు దాఁటి రా
పో టొనరించి కట్టి కలుముచ్చునుం బొంగిలి లేదటంచుఁ దా
టోటుగఁ గత్తిదూయు టకటొంకరకిన్ సిరికిన్ జోహరువుల్. ౧౦౨.

---

౧౦౨. ప.—దీనియర్థమును ప్రతాపరుద్రీయ ద్వితీయ ముద్రణములో నాందిలో చూడవచ్చును.

క. దేవా, మా పగతురపై
మా వైచెడి యంతిమాస్త్రమంత్రము నీవే;
నీవే మా శాంతికముః ;
నీవే మా పౌష్టికంబు, నిగమగ, కృష్ణా. ౧౦౩.

శ్రీకృష్ణ.—స్వస్తి. ఇంద్రాదులారా, వీఁడు మదీయభక్తాగ్రేసరుఁడు, మా ప్రాణసఖుఁడు.

బాణు.— } మహానుగ్రహము, మహానుగ్రహము.
ఇంద్రా.— }

రంభాదులు ప్రవేశింతురు.

రంభా.—జయము జయము త్రిలోకజననీజనకులకు, దేవబందీవిమోచయితలకు. అచ్చరలము మ్రొక్కుచున్నాము. [అని మ్రొక్కి]

(గేయము.)

హరికి మంగళము మా యాపద తీర్చు సిరికి మంగళ మిదే.
తాతకు జోహారు మా యమ్మను గన్న తాతకు జోహా రిదే.
బావకు సలాము మా లచ్చక నేలు బావకు సలా మిదే.
మఱఁదికి భద్రము మా యింద్రునిఁగోడి మఱఁదికి భద్ర మిదే.
హరికి మంగళము మా యాపద తీర్చు సిరికి మంగళ మిదే. ౧౦౪.

శ్రీకృష్ణ.—కల్యాణము కల్యాణము.

బాణు.—శిరీషకుసుమంబుల నెండలో వయిచినందులకు లజ్జించెద.

రంభా.—బాణమహారాజా, నీవలన జగజ్జననీజనకుల కృపకుం బాత్రమైతిమి.

ఆ. జాతిరత్న మొందు సానఁ దీర్చుటఁ జేసి
రాజమకుట మెక్కు రమ్యగతిని,
క్లేశకారి యైనఁ గేశాదిసంస్క్రియ
వలపువానికూర్మి వఱలఁ జేయు. ౧౦౫.

బాణచక్రవర్తీ, నీవు మాకు గురువవు గాని పరిపంథివి గావు.

---

103 ప.—శాంతికము = కీడుందొలఁగించుకర్మ. పౌష్టికము = శ్రేయముగలిగించు కర్మ. నిగమగ = వేదగోచరుఁడా.

104. అమ్మను గన్న = గంగను కన్నట్టి.

అనిరుద్ధుఁడును ఆహ్లాదనుఁడును ప్రవేశింతురు.

అని.— తాతకు అవ్వకును అనిరుద్ధుఁడను మ్రొక్కుచున్నాను. [అని ప్రణమిల్లును.

రుక్మిణీకృష్ణు.— రా నాయనా రా.

[అని చేరఁదీసి ఒడిఁగూర్చుండఁబెట్టుకొని లాలింతురు.

[నేపథ్యములో దుందుభిధ్వానము పుష్పవృష్టియు.]

రుక్మి.— [అనిరుద్ధుని కపోలమున చేయియుంచి అతని మొగమును తనవైపు త్రిప్పుకొనుచు] కష్టములు పడితివా నాయనా?

అని.— మిముఁ బాసినకష్టమే గాని ఒండు కష్టము లేదు.

ఆహ్లా.— అహో! ఎట్టిమహాసత్త్వుఁడు!

శ్రీకృష్ణు.— ఒరులకు పట్టువడితివేమి బాలకా?

ఆహ్లా.— జగద్గురూ, మాచెల్లెలియపరాధ మది. ఆసమయమున ఉష 'ఆర్యపుత్త్రా, మానాయనను గావుము' అని వేఁడినది. ఆమాటకు ఈమహాసత్త్వుఁడు కట్టువడియెనే గాని మానాయనగారి నాగపాశమునకుం గట్టువడలేదు.

శ్రీకృష్ణు.— [నవ్వుచు] సరి, సరి.

బాణు.— [అనిరుద్ధునికి మోఁకరించి] పుత్త్రీభాండ, ఆసురవృత్తిమై గుణము గ్రహింపనొల్లనినా నేరమిని మన్నింపుము. [అని గడ్డము పట్టుకొనును.

అని.— ఎవర వోయి నీవు?

బాణు.— నీమామను బాణాసురుఁడను.

అని.— [ఆశ్చర్యపడుచు] నీ వెక్కడిబాణాసురుఁడవు? బాహుసహస్ర మేది?

బాణు.— వారి ననుగ్రహము. [అని శ్రీకృష్ణుని చూపును.

అని.— [లేచి, బాణునిచేయి పట్టుకొని] నామూలంబున మామకుం గలిగిన ప్రయాసకు మామయే నన్ను మన్నింపవలయును.

[అని పీఠిక యాసనమునం గూర్చుండును.

బాణు.— నీమూలంబునంగదా నాకు సకలాభ్యుదయములుం గలిగినవి!

ఆహ్లా.— [నిర్వర్ణించి] నాయనా, అదె ఉష వచ్చుచున్నది.

ఉషం దోడ్కొని రాణియు, చిత్రరేఖయు,

తెఱపుంగొని కరేణుకయు,

ప్రవేశింతురు.

ఉష.— [చిత్రరేఖతోడ జనాంతికము] చిత్రరేఖా, సఖీ, ఆహో ఆర్యపుత్త్రుఁడు సకలశుభదర్శనుఁడు ఈకన్నులకే అగపడుచున్నాఁడు! ఈకల్యాణమున నాడెందము

అనిర్వచనీయ భావ సమ్మర్ద సమాకులం బై మోహాంబుధియందు మునుంగుచున్నది. నా వసము మీఱి బాష్పఝరంబు కనుదోయి కెక్కుచు దరుల నురులఁగొని పోవుచున్నది! [కన్నులు చేలాంచలమునం దుడిచికొని] ఈ దివ్యసాన్నిధ్యంబున ఆత్మ నెట్టులు వసమున నిలుపుకొంచును!

చిత్ర.—తేఁకువ గల్గుము సఖీ, తేఁకువ గల్గుము. ఈ మంగళపారాయణంబున సమ్మోహముం గడ కొత్తుము.

ఉష.—సఖీ, నీయాజ్ఞ. ఈ లోకగురువుల యెదుర సపుత్త్రినుగా ఆర్య పుత్త్రినిఁ గలయ లజ్జించుచున్నాను. సఖీ, నాఁటి నీకల్యాణోక్తి యిపుడు స్మరణకు వచ్చుచున్నది. వీరెగదా ఆర్యపుత్త్రుని కి [అనునర్ధోక్తిలో]

చిత్ర.—[జనాంతికము] 'మాకు' అనుము.

ఉష.—[జనాంతికము] సఖీ, నీనోట నమృతము పోవలయును. వీరె గదా మాకు అవ్వయు తాతయు! అహో! అమోఘదర్శనులు. వీరిదర్శనముచే నా చిత్తమున నేమో నిర్వృతి యుదయించుచున్నది.

చిత్ర.—[జనాంతికము] వీరే నీమొఱ ఆలకించినవారు. ఈవ్యాజమున నీయుపాసనకు ఫలముగా నీకుం బ్రత్యక్షమైనారు.

రాణి.—[కరేణుకచేతినుండి శిశువుం గొని రుక్మిణిం దఱిసి] అనిరుద్ధ కుమారుని గ్రహింపుఁడు. [అని రుక్మిణి కిచ్చును.

రుక్మి.—[గ్రహించి, నిర్వర్ణించి, ముద్దు లిడుచు] అహో పుణ్యము! ఆర్య పుత్త్రా, ఈబాలసూర్యోదయముం జూడఁ గోరిక కలదా?

శ్రీకృష్ణ.—[కైకొని] ఈస్వరూపము తండ్రికి రెండియు కందువుఁదనము వచ్చి నట్లున్నది!

[రుక్మిణి శిశువును మరలం గైకొని ముద్దులు గొనును. ఇతరులును శిశువును లాలింతురు.

బాణు.—[ఉషం జేరం జని గడ్డము పట్టుకొని] నాకూనా, [తన్ను నిర్దేశించి] ఈక్రూరాత్మునివలన శ్రమపడితివిగదా.

ఉష.—[ఆత్మగతము] అహో! నాయనదైన్యమును నే నెట్లు గందును!

[అని కన్నీళ్లు నించును.

రాణి.—[సబాష్పము] నీనోహ్పాదమేని యభినందింప నోఁచనైతినిగదా!

---

తేఁకువ=ధైర్యము.

ఉ. లోకములోనఁ దల్లులతిలోలలు వేవిధులైనఁగూఁతు న
స్తోక ముదంబుతో నరిది సూడిదలన్ విభవప్రాత్త రోత్సవా
నీకములన్ విభూషలను నిత్యము నోముదు; రల్లె తల్లి నై
యీఁకఁటినాత్మ నీ కిడిన యోఁదర లింపులు నాస్తులే గదా. ౧౦౬.

ఉష.—[సబాష్పము] నాయనకుం గ్లేశ మిడిన నేను గదా యపరాధను. నా తప్పులు నాయన మన్నింపవలయును. [అని బాణునిపాదముల వ్రాలును.

బాణు.—లే అమ్మా లే. [అని లేపి] నీకు సర్వశ్రేయములును త్రైలోక్యమాతాపితలు వారొసంగుదురు. నాకెట్టిన క్లేశములు మఱతువా అమ్మా ?

[అని బాష్పములు విడుచును.

ఉష.—[స్వగతము] ఈలోకగురువులట్టిపోల నాయనకు ఏమి బదులు పలుకఁగలను ! [ప్రకాశము] నాయనా, ఎఱుఁగనిదాని నెట్లు మఱతును ?

బాణు.—పట్టీ, నీక్షమచే లజ్జితుఁడను. [అని బాష్పకులుఁ డగును.

శ్రీకృష్ణ.—రావోయి బాణా, రా; నీదౌహిత్రునిం గనుము.

[అని శిశువును ఇచ్చును.

బాణు.—[కొని కని] అహో !

తే. అమృతమున నూఁరినట్టి కల్పకపుఫలము !
వెలఁది చక్కెర వెన్నల వింతబొమ్మ !
ఈబుడుతగాని నింక నే నీయఁజాల !
పీనిమెలన వ్వి దెంత నిర్వృతి కరంబు ! ౧౦౭.

[అని ముద్దిడి] ఏమి మొగము చిట్లించెదవు ? మీసలు గ్రుచ్చినవా ? లేక నీవును ఆలోచన వాఁడవా ?

రాణి.—అమృతపు బుగ్గా, నిన్ను, మందభాగ్యురాలను లాలింప నోఁచనైతిని.

[అని చెక్కిళ్లు పుణికి తనకపోలమున మెటికలు విఱుచును.

బాణు.—[శిశువును ఉషచేతి కిచ్చి, ఉషను కేలఁ గొని] అనిరుద్ధ మహారాజా, నాదుండగమునకు దండువుగా ఇదె నీకు ఉష నిచ్చుచున్నాను.

---

౧౦౬ ప.—అతిలోలలు=అత్యంతప్రేమ కలవారు.

౧౦౭ ప.—కల్పకపు ఫలము = కల్పవృక్షముయొక్క పండు. వెలఁది = ధావళ్యముగల. ఎలనవ్వు=లేఁతనవ్వు. నిర్వృతి=ఆనంద.

( ధ్రువకోకిల )

దళిత శత్రుఁడ, నీకునై యుష తా సహించిన బన్నముల్
కులగిరుల్ గలయంతకాలము ఘూర్ణిలున్ ధరణీస్థలిన్ ;
గలఁగకో యదువీర, నాపయిఁ ; గన్నె నర్మిలి నేలుమా !
తలఁపకయ్య యుషన్ స్వయంవృతదత్త నొప్పరికింపఁగాన్. ౧౦౮

అని.—పెద్దల చిత్తమును తప్పుచేసికొనను.

శ్రీకృష్ణ.— ఆశిశువు కొఱకటోయి బాణా ? సాలంకార కన్యాదాన మెఱుంగుదుము గాని సపుత్త్రికన్యాదానము చేసినవారిని కొన్నవారిని ఎఱుంగము.

[ఉషాచిత్రలు సాకూతముగా నొండొరులం గందురు.
ఉష సలజ్జముగా నధోముఖిగా నుండును.

రుక్మి.—ఉషా, శిశువును నీయార్యపుత్త్రునిచేతి కిమ్మ.

[ఉష ఇచ్చును, అనిరుద్ధుఁడు గ్రహించును. నేపథ్యమున దుందుభిధ్వానము పుష్పవృష్టియు. ఉష చిత్రలేఖను సాకూతముగాఁ గాంచును. చిత్రలేఖ సాకూతముగా మందహాస మొనర్చును. అనిరుద్ధుఁడు శిశువును నిర్వర్ణించి రుక్మిణిచేతి కిచ్చును.

రుక్మి.—[ఉషం జేరఁ బిలిచి] మహాసాధ్వీ, ఉషా, నీకు తెలుగని సౌభాగ్యమిదె యొసంగితిని.

ఉష.—[కేలోగ్గిడ్చి] మహాప్రసాదము. [ స్వగతము ] నాచెలి వలవంతయుఁ దీఱినంగదా నేను ధన్యురాలను.

రుక్మి.—[ఆత్మగతము] ఆహా! దీనిహృదయ మెంత మైత్త్రికోమలము ! [ప్రకాశము] ఆర్యపుత్త్రా, వీరి కిరువురకు కామ సహాయ, ఉషకు అప్మ దుపాస నోపదేశ గురువు, నారదశిష్య మహాయోగిని, గుణఖని ఈ చిత్రరేఖ. దీనియీాప్సితమును ఈ యుషాభ్యుదయముతోఁ గూర్పుఁడు.

రాణి, బాణ.—ఆహా ! ఈపుణ్యాత్మురాలా, ఉషకును మాకును ఇంత యభ్యుదయము కావించినది ! [రాణి చిత్రం దఱియఁ దివిచి బుజ్జగించును.

శ్రీకృష్ణ.—ఇయ్యవోయి కుంభాండా, నీతనయను అస్మత్ప్రహ్లాద దేశ్యునికి ఆహ్లాదనునికి.

---

౧౦౮ ప.–బన్నముల్=పాట్లు. కలఁగకు=కోపము చేయకుము. అర్మిలిన్=ప్రేమతో. స్వయంవృతదత్తన్=స్వయముగా నీచేవరింపఁబడి తానుగా తన్ను నీకిచ్చుకొన్నదానిని.

ఉష.— [స్వగతము] ఆహా ! ఏమి నా పుణ్యము ! మాయన్నకే చిత్ర యాభరణ మైనది !

కుంభా.—మహాప్రసాదము. [అని చిత్రరేఖ నొడి నిడుకొని]

ఉ. నాదగుకోర్కిచే భువననాథునియానతిచేత నిత్తు నా
గాదిలియాత్మజన్ గగనగామిని యోగినిఁ జిత్రరేఖ నీ;
కోదనుజేంద్రనందన, దయోచితవైఖరి నేలు కూర్మిలోఁ
బేదవు గాకుమన్న; నినుఁ బెన్నిధిఁ గోరిన దన్న భర్తగాన్.

[అని యాహ్లాదనుని కిచ్చును.

ఆహ్లా.—పెన్నిధి ప్రథమగదా. మహాప్రసాదము.

బాణు.—ఓహో క్రొత్తవ్యాకరణాధ్యయనము ! [అందఱు నవ్వుదురు.

ఆహ్లా.—పెద్దలయాజ్ఞచేతను నిజేచ్ఛచేతను గ్రహించుచున్నాను.

[నేపథ్యమున దుందుభిధ్వానాదికము.

రుక్మి.—చిత్రరేఖా, నీకు తలుగని సౌభాగ్య మొసంగితిని

చిత్ర.—[కేల్మోడ్చి] మహాప్రసాదము.

రాణి.—[చిత్రరేఖం జేరం గొని] యూపెత్తిన మాభాగ్యమా రావమ్మా; ఱరమ్మ యువరాజపట్టమహిషీ.

[కరేణుకా గంభీరవేష లాండొరులం గని గుటకలు మ్రింగుచుందురు

శ్రీకృష్ణు.—వీ రెవరు ? వీరికిని అన్యోన్యదాంపత్యాభిలాషవోలె నున్నది.

బాణు.—మహానుభావా, వీఁడు నా బంధువు, వీనికై శిశువుల కీయిమదులు. ఇది యుపాధ్యాత్రేయి. ఇది వీనికి తగినదాంపత్యము.

రంభ.—[ఊర్వశితో జనాంతికము] అది కోఁతికి వెన్నెలబోనము.

శ్రీకృష్ణు.—వీరికిని దాంపత్య మగును గాక. మాలలు మార్చుకొండి.

[కరేణుకా గంభీరులు సంతుష్టితో అగ్న్యాదుల సాహాయ్యంబున మాలలు మార్చుకొందురు. నేపథ్యమున దుందుభిధ్వానాదికము.

---

౧౦౯ ప.—భువననాథుని = జగన్నాథుఁ డయిన శ్రీకృష్ణునియొక్క. దనుజేంద్రనందన = అసురరాజకుమారుఁడా. పెన్నిధిన్ = పెద్దనిధానమును.

పెన్నిధి ప్రథమగదా—పెన్నిధి ప్రథమావిభక్తి యయిన 'నాకు పెద్దనిధాన మయిన చిత్రరేఖయే నన్ను కోరినది' అని భావ మగును.

ఊర్వ.—[రంభతో జనాంతికము] సఖీ, రంభా, ఆరెంటికిని ఇదిదృష్టిపరిహారమునకు.

శ్రీకృష్ణ.—మీకు నమస్కృతికి సెలవు. కాని మీరు దండెములు తీయుతేరు. అందఱకును ఒక్కమాటే దొరలుఁడు.

[అందఱు నవ్వుదురు. ఆయిరువురు నట్లే దొరలుదురు గంభీరవేదియు కరేణుకయు యత్నించియు లేవలేరు.

రంభ.—[జనాంతికము] ఊర్వశీ, ఈనాట్యమును నీ వెక్కడ నేని నేర్చితివా?

ఊర్వ.—ఇప్పుడు నేర్చుకొందము.

శ్రీకృష్ణ.—వీరిదాంపత్యము మిగుల శోభిల్లుచున్నది.

[బాణాహ్లాదనేంద్రాదులు గంభీరవేదిని లేపుదురు. అతఁడు లేచును. రాజ్ఞీరంభాదులు కరేణుకను లేప యత్నింతురు. అది లేవదు. గంభీరవేది లేపును.

శ్రీకృష్ణ.—ఇంద్రాదులారా, మీరెల్ల కడు నలంగితిరి. నిజాస్పదంబులు సేరి సుఖముండుఁడు.

ఇంద్రా.—మహానుగ్రహము. [అని రుక్మిణీ కృష్ణులకు భక్తినమ్రులై, బాణాహ్లాదనులతో] మిత్రములారా, పోయి వచ్చెదము.

[బాణాహ్లాదనులు వారిం గవుంగిలింతురు. ఇంద్రాదులు నిష్క్రమింతురు.

గంభీ. కరే.—[ఒండొరులతో, జనాంతికము) పిల్లకి పొర్లి పొర్లి దండాలు పెట్టి మనంమాత్రం నలగలేదా?

రంభా.—అంజలి చేసెదము. [అని రుక్మిణీహరులకు సాంజలులై, బాణాహ్లాదనులతో] పోయివచ్చెదము.

బాణాహ్లాద.—మంచిది. [రంభాదులు నిష్క్రమింతురు.

శ్రీకృష్ణ.—ఓయి బాణా, శిశువులకు వియోగభారము లేకుండ మీరెల్ల వీని బారసాలకు ద్వారకకు మాతో నిపుడే తరలుఁడు.

[కీ యనుచు గరుడుఁడు ప్రవేశించి హరిని ప్రదక్షిణించి ఒక్కెడం గూర్చుండును.

శ్రీకృష్ణ.—మే మెల్ల చిత్రాహ్లాదనుల యథావిధి వివాహమునకు మరల నిటకు వచ్చెదము.

బాణు.—<br>
రాజ్ఞి.—<br>
ఆహ్లా.—<br>
కుంభా—<br>
} మహాప్రసాదము, మహాప్రసాదము.

శ్రీకృష్ణ.—కుమారా, అనిరుద్ధా, ఈయభ్యుదయములో నీకు ఇంక నేమనో రథముం దీర్తును?

అని.—లోకనాయకా,

ఉ. కూరిమిబంధు లై రసురకుంజరు, లంబుధి వేష్టితోర్వరా
సార రసాయనౌషధిగ సన్నుతి గన్నది పత్ని యయ్యె, నిం
డారె ముదంబు చిత్రయు సముచితశీలునిఁ జెట్టఁ బట్టుటన్,
గోరిక లింక నేమి గలుగున్ గరుణాభరణాత్మ, చెప్పుమా. ౧౧౦.

అయిన నిది యగుఁగాక.

(మంగళమహాశ్రీ)

శ్రీసుదతికాంతుకళఁ జెందినఘనుల్ జనుల
సేమమును సేయుదురు గాతన్,
వాసవుఁడు గాలమున వర్షిలుతఁ, బాఁడియును
బంటయు నవారి యగుఁగాతన్,
వాసిమొయిఁ బైదలులు భర్తృహితవృత్తలయి
భాగ్యములఁ దేలుదురు గాతన్,
భాసుర మనీషి కవి వాగమృత వాహినుల
వర్తిలుత మంగళమహాశ్రీ. ౧౧౧.

ఉషానాటకము సమాప్తము.

---

౧౧౦ ప.—దానవేంద్రులు ప్రియబంధువు లయినారు. సముద్ర పరీత సర్వ భూమండలములోను శ్రేష్ఠ మైన దివ్యౌషధి యని ప్రసిద్ధి చెందిన యుష నాకు భార్య యైనది. నా చెలి యయిన చిత్రరేఖయు మంచి మగని బడయుటచేత మాహృదయములకు ఆహ్లాద మయినది. కరుణాలంకృత హృదయుఁడా ఓ దేవా, ఇంకను కోరిక లే ముండును?

౧౧౧ ప.—శ్రీ...నుల్=లక్ష్మీనాథునియొక్క కళను పొందిన గొప్పవారు - అనఁగా రాజులు. వాసవుఁడు=ఇంద్రుఁడు. పైదలులు=స్త్రీలు. భాసుర...శ్రీ=ప్రసిద్ధ విద్వాంసు లయిన కవులయొక్క వాక్కు లనెడి యమృత నదులయందు శుభ మయిన మహాశ్రీ వసించుఁ గావుత.

శ్రీ ర స్తు.

శ్రీ జార్జి రాజ చక్రవర్తికి మంగళము.



జయము జయము జార్జిరాజచక్రవర్తికిఁ.
జయము జయము జార్జిరాజచక్రవర్తికిఁ.

పుడమిఁ బంచమాంశ మెవఁడు ప్రోది చేసెడిఁ, జయము.
వెడల రేవని భువిని వీడి విధుఁడు సూర్యుఁడుఁ, ,,
ఢిల్లిలోన గద్దె నెవఁడు శవి నెక్కెనో, ,,
తల్లి తండ్రి యెవఁడో మనకుఁ దానె నిచ్చలుఁ, ,,

మంగళం బతనికిఁ జేయు మాధవుఁడు సదా,
మంగళం బతనికిఁ జేయు మాధవుఁడు సదా.

---